ప్రభాకరరెడ్డి కోసం
పౌరహక్కుల ప్రజాస్వామిక పోరాటంలో
ప్రాణాలిచ్చిన వారికోసం....

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాసపత్రిక

194
డిసెంబర్ 1991

నిర్వహణ
'సాహితీమిత్రులు'

# సృజన

## ఆధునిక సాహిత్యవేదిక

194 మాసపత్రిక డిసెంబర్ 1991

ఈ సంచికలో




నిర్వహణ

'సాహితీమిత్రులు'

ఈ సంచిక రు. 5 సంవత్సర చందా రు. 50

Edited, Printed and Published by P. Hemalatha, Flat 11,
Block 1, MIG II, Baghlingampalli, Hyderabad-500 044
and Printed at Nagendra Press, Vijayawada-520 002
Working Editor : Vara Vara Rao

(ప్రశ్న)

వాళ్ళు గోదావరిని ప్రవహించవద్దన్నారు. అది మైదానాలకు తడినీ అడవికి అలజడినీ నేర్పుతున్నదని, నదికి కంటికి రెప్పల్లా అంటిపెట్టుకొని ఉండొద్దని తీరానికి హెచ్చరికలు చేశారు. పంటల్ని కోసి ప్రవాహానికి అడ్డంగా వేశారు. పసుపుల్ని తరిమేసి ప్రవాహాన్ని కసాపిసా తొక్కించారు. బియ్యమూ, గ్యాసు నూనే కలిపి నీళ్ళల్లో పారబోసి నిప్పు పెట్టారు. ఇళ్ళు తగలబెట్టి భూతల్లి కడుపు కాలుతుందనుకున్నారు. ఆకాశం మొహం మాడుతుందనుకున్నారు.

ఆకాశంలోని వెలుగు చీకట్లను మోస్తూ అంతటా జీవనది పారుతూనే వున్నది.

వాళ్ళు నదిమీది కోపాన్ని ఊరుమీద చూపారు. అడవిమీద చూపారు. నీరు కాదు సారా తాగమన్నారు. కాదంటే ఉచ్చ తాగమన్నారు. వాళ్ళుమాత్రం ప్రజల నెత్తురు తాగుతున్నారు.

ప్రవాహానికీ దాహార్తులకు మధ్యన దారులన్నీ తెంచి బయొనెట్ల కాపలా పెట్టిన రాజ్యాన్ని ఒక ప్రశ్న నిలదీసింది. జనానికి జవాబుదారీ కమ్మన్నది. ఒడ్డుల్ని ఒరుసుకున్న ప్రమాదాల్ని ప్రశ్నిస్తూ మానవ హారమై ప్రశ్న టాటూనదిపై వంతెనను తలపించింది.

వాళ్ళు రోజా ప్రశ్నని పరిమార్చాలనే అనుకుంటున్నారు. వాళ్ళు ప్రతి ఉదయమూ ప్రభాకరుణ్ణి పరిమార్చాలనే అనుకుంటున్నారు. ఆ రోజు అది సాకుఅయింది అంతే.

చైనా విప్లవ చరిత్రలో టాటూనది దాటడానికి 'లాంగ్‌మార్చ్'కు మనుషులే వంతెన కావాల్సి వచ్చింది. గోపిరాజన్న, డాక్టర్ రామనాథం, జాపా లక్ష్మారెడ్డి, నర్రా ప్రభాకర్ రెడ్డి—ఇంకా ఈ వంతెన పూర్తి కాలేదు. డిసెంబర్ 8న ప్రభాకర్ రెడ్డి అంత్యక్రియల సందర్భంగా ఆయన స్వగ్రామమైన వెల్దండలో వేలాది ప్రజల ముందు బాలగోపాల్ చెప్పినట్లు ఇంకెంతమంది ప్రజాస్వామ్యవాదుల త్యాగాలను ఈ వంతెన కోరుతున్నదో. మీరు మాట్లాడవచ్చు. మనం మాట్లాడవచ్చు. మనం ప్రశ్నించాలి— అన్నందుకు ఇంకెంతమంది రక్తమాంసాలు ఈ వంతెనకు పునాది కావాల్సి వున్నదో.

పాశాల బరువు కట్టుకొనే సాహసికుణ్ణి వెనక్కి తిరిగి చూడకుండా మట్టి

పోస్తూనే పొమ్మన్నదట చెరువు. ఎక్కడ వెనక్కి చూస్తే అక్కడ ఆగిపోతానన్నదట. నదికి ప్రవహించే స్వభావం వున్నది. నడవాలా-పరుగెత్తాలా అన్నది మైదానాలా, కొండలా, రుతువులా నిర్ణయిస్తాయి. అవరోధాలా, అనుకూలతలా నిర్ణయిస్తాయి. ప్రజలకు ఆకలి దప్పులు వున్నాయి. అవి తీర్చుకోవడానికి కష్టం చేసే శక్తీ, ఊహ చేసే బుద్ధీ వున్నాయి. అవి వినియోగించుకునే క్రమంలో అడ్డువచ్చే అక్రమాలను ప్రశ్నించే హక్కు వాళ్ళకున్నది. ఆ హక్కులకోసం పోరాడే హక్కు ప్రజలకున్నది-అంటున్నారు పౌరహక్కుల వాళ్ళు.

హక్కులు ప్రజలకే గానీ, ప్రభుత్వాలకు లేవా ? అని చాలా ధర్మసూక్ష్మం అడిగినట్లుగా మాట్లాడుతారు కొందరు. హక్కులేం వచ్చె ప్రభుత్వాలకు అధికారాలే వున్నవి. ప్రజలు ధారాదత్తం చేసిన అధికారాలే వున్నాయి. అందులో విధులే హక్కులనిస్తాయనే విషయాన్ని విస్మరించి ప్రభుత్వాలు హంతక అధికారాలు చెలాయిస్తున్నాయి. ప్రజలకు కూడూ, గూడూ, గుడ్డ హామీ ఇవ్వాల్సిన ప్రభుత్వం భూస్వాముల అక్రమ ఆక్రమణలో వున్న ప్రభుత్వ భూమిని స్వాధీనం చేసుకొని తమ కూడూ, గూడూ, సంగతి ప్రభుత్వం మానె తామే ఆలోచించుకుందామని ప్రజలను కుంపే ఆయుధాలతో అడ్డొస్తున్నది.

రాజ్యాంగంలో సంక్షేమ రాజ్య ఆదేశక సూత్రాలు రాసుకున్న ప్రభుత్వం ప్రజల్ని మత్తులో ముంచెత్తుతూ ఊరూరా ప్రభుత్వ సారాదుకాణాలు పెడుతుంటే 'సారాబంద్' పాటించి ఆ ఆదేశిక సూత్రాలను ప్రజలే అమలు చెయ్యబోతే పోలీసు ఠాణాలను సారాదుకాణాలుగా మారుస్తున్నది. అయినాసరే ససేమిరా సారాతాగమన్న ప్రజన్ని బలవంతంగా తాగించడానికి బెటాలియన్ల కొద్దీ సరిహద్దు భద్రతా దళాలను దించుతున్నది.

ఇదివరకు ఏ ప్రభుత్వ హయాములోనూ జరుగనంతగా ఇవాళ అణచివేత అమలవడానికి విప్లవోద్యమ విస్తృతి ఒక ప్రధాన కారణమైతే, రాష్ట్రవ్యాప్తంగా ప్రజలు చేపట్టిన సారా పోరాటాలు తక్షణ కారణమవుతున్నాయి. ఎందుకంటే సారాంశంలో సారా వ్యతిరేక పోరాటం సామ్రాజ్యవాద భూస్వామ్య వ్యతిరేక పోరాటం.

రైతుకూలీ సంఘం మహాసభల తర్వాత వేలాది గ్రామాలలో లక్షలాదిమంది భూమిలేని నిరుపేదలు ఎక్కడికక్కడ భూములు ఆక్రమించుకొని ఎర్రజెండాలు

పాతుకొని నాగళ్ళు కట్టినా, గుడిసెలు వేసుకున్నా ఈ ఉసిళ్ళ పోరు ఎల్లకాలం ఉండ బోదులే, పోలీసు క్యాంపులొస్తాయి, భూమిమీద మళ్ళీ తమకు అధికారమొస్తుంది-అని చాలామంది భూస్వాములు నిమ్మకు నీరెత్తినట్లున్నారు. ఒక పంటనో, రెండుపంటలో వదులుకోవల్సివచ్చినా, అసలు అమ్ముకోవద్దని ఆంక్షలుపెట్టినా భూమెక్కడపోతుంది ఊళ్ళో ఉంటుందికదా. పోనీ భూమిమీద వుంటుందికదా అని ఎప్పుడో తమకు అనుకూలమైన సమయం వస్తుందని కాచుకున్నారు. (భూమెక్కడ పోతుంది. ఎల్లకాలం పోలీసు క్యాంపులుంటాయా, పోలీసులు భూముల్నయితే అరెస్టుచేసి తీసుకపోరుకదా! తుపాకులయితే భూముల్ని దున్నవుకదా! అని రైతాంగం కూడా భూముల్ని బీడు పెట్టాల్సి వచ్చినపుడు అదే భరోసాతో ఉన్నారు. ఇల్లలుకగానే పండుగ కాదని ఒక రనుకున్నారు. పోలీ, పోలీ, నీ భోగమెన్నినాళ్ళులే, పోరు దారిలో ఎపుడో కూలి చస్తావులే అని ఒకరనుకున్నారు).

కానీ సారా పోరాటం అటువంటిది కాదు. దీని ప్రభావానికి ఎంత దీర్ఘకాల శక్తి వుందో అంత తక్షణ సంక్షోభం వుంది. నిజానికి రాయలసీమ భూస్వాములంతా, పార్లమెంటరీ పార్టీ నాయకులంతా, ముఖ్యంగా కాంగ్రెస్ నాయకులంతా సారా కాంట్రాక్టర్లే. ముఠాతగాదాలన్నీ ఈ యుద్ధ ప్రభువుల మధ్యనే. మైకంలో మైసూరా రెడ్డి నక్సలైట్లను మాఫియా గ్యాంగ్‌లనడం అద్దంలో తన మొహం చూసుకోవడమే. ఈ పది పన్నెండేళ్ళ ఉత్తర తెలంగాణా విప్లవోద్యమం వత్తిడివల్ల తెలంగాణా పల్లెల్లోని భూస్వాములు కూడ ఊళ్ళు వదిలి సారా కాంట్రాక్టర్లుగా, బ్రాందీ, బీర్ షాప్‌ల ఓనర్లుగా పట్టణాలకు ఎగబ్రాకారు. అక్కడ కాళ్ళకింద భూమి కదిలిందని ఇక్కడికి వస్తే, అక్కడ కాలుకింది మట్టి కంట్లో రాలిందని ఇక్కడికి వస్తే ఇప్పుడు సారా పోరాటం తమ ఉనికికే నీళ్ళు తెచ్చింది. మత్తుపదార్థాలా, ఓట్లమత్తుతో పేదప్రజల్ని తమ గుప్పెట పెట్టుకోవాలనుకున్న ఈ పాలక వర్గాలకు తను రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక వనర్లు తెగిపోయినట్లు అయింది.

ఎన్నడో ఇరవయి ఏళ్ళక్రితమే గద్దర్ 'మమ్మేలే రాజ్యానికి మారుపేరువే నీవు' అన్నట్లు సారా (సారా, బ్రాందీ, విస్కీలతోపాటు ఈ వరుసలో రేడియో, టీ.వీ వంటి ప్రసార సాధనాలనూ పార్లమెంటు, అసెంబ్లీల వంటి దొంగ ఓట్ల రాజకీయాలనూ చేర్చవచ్చు) రాజ్యానికి పర్యాయపదమైపోయింది.

దేశంలో బ్రిటిష్ వలస పాలన వచ్చి చక్కెర మిల్లులు వచ్చినప్పటినుంచి

నిజానికి పిప్పిగా పారేయదగిన మొలాసిస్ సారాగా దిగుమతి అవుతున్నది. అప్పటి నుంచి ప్రభుత్వాలే సారా వేలంపాటలు పాడుతున్నాయి. పనిగట్టుకొని ప్రభుత్వాలు ప్రజలకు మత్తు పదార్థాలు తాగించి ఆ బలహీనతపై ఇంకే నిర్మాణ కార్యక్రమాల మీదకూడ రాబట్టనంత ఆదాయాన్ని రాబడుతున్నవి. 'ప్రభుత్వాల రాబడే కాదు, ఆబ్కార్, రెవెన్యూ (ఆదేశిక సూత్రాలను అమలుచేసే క్రమంలో అక్షరాస్యతా ప్రచారాలు చేపట్టిన జిల్లా కలెక్టర్లే సారా వేలంపాటలు కూడ పాడుతున్నారు!) పోలీసూ మొదలయిన శాఖలలోని ఉద్యోగులూ, ప్రయివేటు గుండాలూ, అసాంఘిక శక్తులూ అన్ని పార్టీల రాజకీయ నాయకులూ (కొందరు మాజీ విప్లవకారులతోసహా) అందరి అక్రమ ఆర్జనకూ సారాపాటలే 'ప్రధాన స్రవంతు'లయినాయి. (మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన కాసేపటికే మాగంటి రవీంద్రనాథ్ చౌదరి ఒక సారా పార్టనర్‌తో మాటా, మాటా పెరిగి గుండెపోటుతో మరణించాడంటే ప్రభుత్వ అధికారానికి సారా పై అధికారం ఎట్లా పర్యాయ పదమో అర్థమవుతుంది.) ప్రజల ఆర్థిక జీవన విధానంపై మాత్రమే కాదు దానితో పెనవేసుకున్న సంస్కృతిపై, విలువలపై ఈ వ్యసనానికీ, ఈ బలహీనతకూ పట్టువున్నదని భూపోరాట క్రమంలో, భూపోరాటాన్ని ప్రజాస్వామిక విప్లవంలో అంతర్భాగంగా నిర్వహిస్తున్న క్రమంలో ప్రజలు గ్రహించారు. అందుకే ఇవాళ ఈ సారా పట్టునుంచి బయటపడేందుకు ప్రజలు పట్టుదలతో ప్రభుత్వాలతో తలపడుతున్నారు.

ఓ దీర్ఘకాల పోరాటాన్ని, సుదీర్ఘకాలం గెరిల్లా పద్ధతుల్లో నడిచే స్వభావం వున్న పోరాటాన్ని ప్రభుత్వం 'టెర్రరిస్టు'వలె అన్నివైపులనుంచి ఒత్తుకొచ్చి 'అంతు చూస్తా'ననీ, క్రాక్‌డౌన్ అనీ చెప్తున్న, చేస్తున్న పద్ధతిని చూస్తే పాలక వర్గాలకు ఒక సత్వర ప్రయోజనం వుందని, ఆ సత్వర ప్రయోజనం 'సారాబంద్' ప్రమాదాన్ని ఎదుర్కోవడమని గ్రహించవచ్చు. సారా వేలంపాటలు ప్రారంభమయి అక్టోబర్ 2 గాంధీ జయంతినాడు నూతన సారా సంవత్సరం ప్రారంభమయినప్పటినుంచి రకరకాల పోలీసు, పారామిలటరీ, మాఫియా గాంగ్‌ల సందడి సంరంభం ప్రారంభమయ్యాయి. దాదాపు మూడు నెలలుగా వరంగల్ జిల్లా నర్సంపేట, జఫర్‌గఢ్, వర్ధన్నపేట, నెక్కొండ, హనుమకొండ మొదలయిన గ్రామాలమీద జరుగుతున్న పోలీసు దాడులు, ఆ దాడుల విషయంలో నిజ నిర్ధారణకై కాలికి బలపం కట్టుకొని తిరుగుతున్న పౌరహక్కుల సంఘం వ్యగ్రత పోల్చుకుంటే పోలీసుల కక్షకు కారణం అర్థమవుతుంది. ఎనిమిది గుడిసెలున్న లంబాడా తండాపై చెన్నారావుపేట మండలంలో తెల్లవార్లూ ఎస్.పి నాయకత్వంలో గుళ్ళవర్షం కురుస్తున్న రోజు దిన

(తరువాయి అట్ట 3వ పేజీ)

## సముద్ర స్నానం

చెరుకు సుధాకర్

భూమి స్వప్నాన్ని మోస్తున్న
కళ్ళకు, కాళ్ళకు, చేతులకు, శిరస్సుకు
వెలకట్టే మట్టికాళ్ళ రాక్షసి పాదాలముద్రల్ని
గలాగలానవ్వే నీ అలల అలజడితో
ఒకసారి కడిగి, ఊపేసినవాడా,
సముద్రుడా! సముద్రుడా!
ఎక్కడని వెతుకను
జీవన్మరణ చిరకాలవాంఛిత తపోఫలాన్ని
దేంట్లో పోల్చుకోను
రెక్కవిప్పిన రిక్కల సహదేవుడో,
మెయిల్‌దార్లో మైలుగాయయిన నా నల్లవజ్రం మొలైసో
ఎవరై తేనేం కాని
రెప్పలార్పని నీ స్వప్నమే, నీ ఆకాంక్షే
సమిష్టిరూపమై మమ్మల్ని వెంటాడుతోంది
వాడంటాడు,
ఎక్కుపెట్టిన మన శిలాలనిండా సాయుధ తీక్షణతే కనిపిస్తుందని
మన మంటున్నాం
దానవశిల్పాన్ని మలుస్తున్న పాపపు చేతులపై
నమ్మెతై మోగడమే సాయుధమయినట్లయితే
నీ కుట్రలకు, ఆరోపణలకు నూరేళ్ళాయుషు నింపుకొమ్మని
చిక్కని చీకటి మధ్య
జరజరా పాకుతున్న విద్యుల్లతవు నీవు
విశాల ప్రజానీకపు పోరాట సాంప్రదాయంగా నిన్ను
కోట్ల ప్రజల ఆకాంక్షల జయకేతనంగా నిన్ను
మేము ఎచటైనా మలుచుకుంటాం
ఎప్పుడైనా పోల్చుకుంటాం
కామ్రేడా!
సముద్రుడా! సముద్రుడా!!

## మెదక్

కొట్రుగడ్డ దయానంద్

అమ్మంత అమాయకమైందే కాదు
ప్రియురాలంత అయోమయమైంది కూడా ! !
నాకు స్తన్యమిచ్చిందీ లాలించీ బుజ్జగించీ
మైమరపించీ నా కౌమార్య రుతువుల్ని
దాటించిందీ నువ్వే కదమ్మా!
నిజంగా నువ్వు నా చదువుల బడివమ్మా!

నువ్వు గుర్తొస్తే చాలు
ప్రియురాలి తొలిరోజు పరిమళం నాచుట్టూ వ్యాపించింది
పక్కలో లేని ఆమెను
సున్నితంగా నా ఎదమీదకు లాక్కున్నట్టుంది
తొలిరోజుల్లో నువ్వు
నాకొక అర్థంకాని రహస్య ప్రేమలేఖవి
ఆమె చెవులకు వేళ్ళాడే అద్భుత ఆశ్చర్యార్థకానివి
మెల్లి మెల్లిగా పురివిప్పి ఆడుతున్న నెమలి సప్తవర్ణ కేశ సమూహానివి
ఇప్పుడేమో
ఎంత అమాయకానివో అంత ఆవేశానివి
ఎంత అయోమయానివో అంత నిబద్ధురాలివి
నారి సంధించావ్ శస్త్రాలు అందించావ్
యుద్ధ క్రీడల్ని అభ్యాసం చేస్తున్నావ్
పిరులు పాయలు పాయలుగా
నీ మార్గంలో సంచరిస్తున్నారు
పుత్రశోకాన్ని కళ్ళల్లో కదల్నీయకుండా
గుండెల్లోనే రహస్యీకరించుకుంటున్నావ్
నువ్వు గుర్తొస్తేచాలు
దసరా పండుగకు ఒకతల్లి సంకేత స్థలంలో

కథ :

# సావుకర్చు

సువర్ణముఖి

కరెంటు తంబాన్మీద ఎపులో ఎక్కి చుట్ట కాలుతున్నట్టగ ఎఱ్రగ రంగ ప్మిరపకాయనాగ ఎలుగెలిగి పోతుంది, కరెంటుబుడ్డీ.

అచ్చిలు, అంగబంగాలు, దోప్డీలు దౌరుజన్యాలు, దురమారగాలా, కుచ్చి తాలు, కుతంత్రాలు, అర్ధరాత్రి ఉన్నోలు హాయిగా తొంగున్నప్పుడు అనాదోళ్ళు అరి చిన ఆకలి అరుపులు, పట్టపగలు బట్టబయలుగా చెట్లుకికట్టి కాల్చీడాలు యిన్ని జరుగు తున్నా, ఏమీ పట్టించుకోకుండా, యెదవబతుకు బతుకుతున్న యెదవల్లాగ, ఎలుగు తుందంటే ఎలుగుతుందే, ఎఱ్రగ ఎలుగుతుంది గవరమెంటుగోరి ఈఁదీపం.

నల్ల సిమిడిపిక్కలాగ, దాన్లోని సిమిడిలాగ, కల్లకాటుకలాగ, బండి కందెన లాగ చిక్కటి చీకటి.

ఆ చిక్కటి చీకట్లో సూరమ్మ నుదుటిన బొట్టులాగేవుంది జాతపోల్ల పీదిలో కరెంటుబుడ్డీ. దాని వెలుతురు దేనిమీదా పడలేదు, దానిమీదకూడ.

వెండి పోకలాగ పార్తంది ఏరు. కొండమీదున్న సవరోళ్ళ సెమటే గావల వూటల్లాగ అలగ కారికారి ఒక దగ్గర చేరిచేరి ఇలా పార్తంది. అది తిన్నగ 'వనజ' పండావోడి భూమిలోకి, దాన్నించి 'జియ్యమ్మవల్స' మండవాదికోరిగోరి భూమిలోకి ఎల్లిపోతాడి.

---

కొడుక్కి కొత్తబట్టలు అందించడం గుర్తొస్తుంది
పాలపిట్టను చూచి కేరింతలుకొట్టి మిత్రులందరూ
జొన్నకంకి బంగారంతో కౌగిలించుకోవడం గుర్తొస్తుంది
అమ్మ సంజీవని హస్తాలకన్నా....
ప్రియురాలి గాజుల చేతుల గజ్జెల కాళ్ళసవ్వడికన్నా....
నువ్వంటే అన్నిటికంటె ఎక్కువిష్టం
జాగ్రత్త తల్లీ !
యుద్ధం పదిలం ! బిడ్డలు పదిలం ! !

సవరోళ్ళ సెమట అక్కడ సరుకై పోద్ది. సంపదొచ్చి ఆల టంకుపెట్టిల చేరి పోద్ది. ఇక సరుకు అంచెలంచెలుగా అమెరికా ఎలిపోద్ది. నేపోతే రయ్యీమని రష్యా ఎలిపోద్ది. ఏదైతే మనకు ఎందుకుగాని.

అదిగో ఆ ఏరు అవతల నిలబడ్డారు పోలీసోళ్ళు. ఏట్లోకి జీపిరాదుగనుక.

ఏంతలోతు? ఏటిమంచి? ఏటిచెడ్డ. బురదా? ఇసకా? ఇవేవి ఆలోచించ నవసరం లేకుండా రాలు కనబడతన్నమ్.

దిగిన దగ్గిర ఎక్కిన దగ్గిర బిక్కలు కుమ్మిడంతోటి జార్తంది. ఎపులో జారి పోగ్రను. ఉత్తిలోన తప్పోయిందిగాని నేపోతే కాళే యిరిగిపోను.

నిన్నటిదాకా పాలపిండిలాగ, పంతులోరి పంచిలాగ మరీ తెల్లగా కాక పోయినా, సవరోడి గోసిలాంటి మాసిన తెలుపులాగైనా వుండేది వెన్నెల. అమావస్యా రోజులు వచ్చేసినాయి. కళ్ళు చీరుకుంటే ఎలాగ కనబడదుగాని కంట్లో వత్తులేసు కున్నా కనబడ్డంలేదు.

ఏరుదాటతన్నరు ఒకలుకాదు ఇద్దరుకాదు.... అలాగని ముగ్గురూకాదు... ముప్పేమంది. ఆలకీ అందరిలాగే రెండేసికాళ్ళూ రెండేసి చేతులూ, ఒకబుర్రా, మెదడు గురించి తేలీదూ, ముప్పే రెండించీలపైనే ఛాతివుంది. అయితే మూడించీల గుండెవుందా అది నిమసానికి ఎన్నిసార్లు కొట్టుకుంటుంది, అసలాలకి గుండెకా యుందా, ఊపిరితిత్తులున్నాయా? అందులోంచి వూపికొత్తందా? అది ఎగూపిరా! దిగూపిరా? ఆలకి దమనులు సిరలు వున్నాయా? అందులోంచి రక్తంపార్తందా? బయిం పార్తందా? అవేవి పట్టించుకోకపోతే, పరిగనలోకి తీసుకోకపోతే, సరిగ్గా నిక్కచ్చయిన మనుషులు ముప్పేమందున్నారు.

డియెస్పీగోరు మరో అరుగులు దాటీసేరు. ఒకలుకొకలు దాటతన్రు.

వెనుకనున్న ఇద్దరు కానిస్టేబుళ్ళు మెల్లిగా మాట్లాడుతున్నారు ఒకరు కసింత సీనియర్. ఇంకొకడు తేరీక కొత్తోడు.

కొత్తోడు అడిగాడు —

"గురువుగారూ! నాకు తెలీక అడుగుతున్నా ...ఈ సికాకులమ్లు అంత పెద్ద పోరాటం జరిగిందాట కదా! అప్పుడు సేనా బాధలు పెట్టారట ఇళ్ళలు కాల్చేసాలు ...

అడోళ్ళని చెరిసీడాలు....పంటలు నాశినం చేసీడాలు....ఇంకెలెటో చేసినారటకదా ! అయినా....జిడవకుండా మళ్ళీ ఈలు నచ్చలైట్లుతోటి ఎందుకు చేరినారంతారు" అడిగాడు శిష్యుడు కాని శిష్యుడు గురువుకాని గురువుని.

గురువుగారు ఇలా సెలవిచ్చారు—

"నీకూ-నాకూ సిగ్గునేక ఈ నౌకరీల చేరినాం. చాలీచాల్ని బతుకులు బతుకు తున్నాంగాని - సీమూ-రక్తమూ వున్నోడు ఎవుడయ్యా కుక్కలు కక్కీసిన కూటికి ఆశపడతాడు ? నానా యిబ్బందులు పడినా నాలుగు రుచులూ కోరుకోడు" అన్నాడు గురువు. లాగిలంపకాయ కొట్టినట్టయింది శిష్యుడికి.

అందరూ దాటిపోనారు. ఏరైతే దాటిగే దాటిపోనారుగాని ఎదురుగ మరిడమ్మ లాటి గాటీ జూసి గుండె జారిపోయింది. కాని తప్పుకాదా ! అ గాటీ మీదన్న గూడకే వారి ప్రయాణం.

"చేసింది చచ్చరోడి పని అబ్బా ! చెండాలమంటే అవుతాదా పద పద" అన్నాడు ఇందాకలు గురువు కాని గురువు. శిష్యుడు గురువుగారి బాటలో నడిచీసాడు.

అందరూ గాటీ ఎక్కుతున్నారు లేతలేత జొన్నసేని, గంటిసేని, కొర్రలు వాళ్ళ కాళ్ళకు అడ్డు పడుతున్నాయి. ఎపులో జొన్నమొక్క కుమ్మేసారు. అది మొదలు కొన్ని వందల మొక్కలు ఏడ్చుకుంటూ విరిగిపోయాయి.

అవి పోలీసోళ్ళు పట్టించుకోలేదు. ఎవరు చస్తున్నారు ఎవరేడుస్తున్నారు.... బిడ్డల్ని చంపితే తల్లులెంత బాధపడతారు గూడేలు కాల్చితే మూగజీవులు ఎంత కుమిలిపోతారు. ఇవన్నీ ఆలోచించినోళ్ళయితే-అ నౌకరిలోనే చేరకపోదురు.

అగాటీ కొంచెం పైకి ఎక్కి వంపు తిరిగేసరికి గూడెంలో ఓ ఇంటిముందు చిన్న మంట కనిపిస్తుంది. గూడేమంటే గూడెమే-మూడేమూడిల్లు. ఆ మూడూ ఒక్క కుటుంబమే. కుటుంబ పెద్దే గూడేం పెద్ద. పేరు బిడ్డిక యెంకన్న. యెంకన్న ఇంటికి ఇవతలింటిలో వాళ్ళ తమ్ముడు ఉండేవాడు. లేడు చనిపోయాడు. అతని పెళ్ళం పిల్లలు వుంటున్నారు. అవతల పక్కింటిలో యెంకన్న పెద్దకొడుకు యేరుపాటుగా కాపర మెట్టాడు.

ఇసిరేసిన కూడు మీదకి కుక్కలు కలబడినట్టు వెళ్ళి మూడిళ్ళమీదా పడ్డారు పోలీసులు.

కుక్కల్లా అలు కలబడితే వెంకన్న పెంపుడు కుక్కలు కలబడ్డాయి. అల తుపాకులు జూసి నిలబడి అరిచాయి.

అందరూ అగ్గి బుట్టినట్టు గాబరా గాబరా లేచిపోనారు. అప్పటికే ఎంట తగిలిన ఎలక పిల్లల్లాగ అన్ని మూలలు నెలికేసారు పోలీసులు.

ధీమాగా బయటకొచ్చారు. బయటకొచ్చేసరికి ఇంటిముందు మండుతున్న కర్రలకి బొగ్గు రాల్చి మళ్ళీ మంట ఎత్తిరించాడు వెంకన్న.

బయటకొచ్చిన పోలీసుల్లో కొందరు అటూ ఇటూ చూత్తన్నరు. అది వాళ్ళ పద్ధతో లేక వాళ్ళకిచ్చిన శిక్షణో లేక ఎవల మట్టుగ వాళ్ళకి బయమోగాని చుట్టూ చూత్తన్నరు.

D.S.P.గారు మాత్రం దొడ్డిలో మంచి పొజిషన్‌లో నిలబడి—

"అ....నీ పేరేటిరోయ్"- అడిగాడు

"బిడ్డి వెంకన్న...."

"అ....నీటి సంగతి ? అన్నగాళ్ళకు తిండి తిప్పలు పెట్టి ఆదరిత్తున్నావట.... హా...." అన్నాడు D.S.P. బయాన్ని బయటకు పొక్కకుండా.

D.S.P.గారు సామాన్యులుకారు. మంత్రులు చేసే రిగ్గింగ్‌లలోనూ, వాళ్ళ కూతుళ్ళ చేసే ఏక్సిడెంట్‌లలోనూ, వాళ్ళ కొడుకులుజేసే మర్డర్‌లలోనూ, మాన బంగాలలోనూ అన్నింటిలోనూ ఉన్నోలికి సేవశేసి ఉన్నతమైన పదవిలోకి వచ్చిన వారు. అందుకే ఎదుటి వ్యక్తి గంభీరంగా మాట్లాడనంతవరకూ గంభీరంగానే మాట్లాడతారు.

వెంకన్న సెకలించాడు సెకలించి—

"ఎవుడన్నాడు....నిన్నగాక మొన్న నాను జెయిలుకొన్నొచ్చినాను. అస్సలు జెయిలు కెందుకెళ్ళినానంటే నచ్చలైటు కేసుమీదే జెయిలుకెళ్ళినాను. తిరిగొచ్చిన తర్వాత అలు కలకే నానిలగ ఉండిపోన్ను. కలిత్తే నానెందుకు ఇంటికాడుంతాను. అన్నాడు గంభీరంగా D.S.P. సుదుటిన వానం మేకు దిగ్గొట్టినట్టు.

D.S.P.గారికి వుండవలసినన్ని హోదాలు D.S.P.గారికున్నాయి. మరి యెంకన్నగారికి లేవా ? ఎందుకులేవు—

శ్రీకాకుళ పోరాటంలో సాపుకార్లతోని పారెస్టోళ్ళతోని ఉద్దంజేసి జెయిలు కెళ్ళి, జెయిల్లోన దెబ్బలాడి తిని, తిరిగొచ్చినోడు. అందుకే అలగ చెప్పినాడు.

D.S.P.గారు వూరుకోలేదు. అసలే గవరమెంటుకి పెద్దకొడుకులాటి పోలీసు డిపార్ట్మెంట్లోని మనిషి—

"ఏయ్....ఎవడితో మాట్లాడతన్నవో తెలుసా" కోపం చూపించడానికి ప్రయత్నించారు.

"అవున్ బావ్....పున్ని మాటంతే పూర్నాయిడికి కోపమొత్తాది ... ఏ అన్నగాళ్ళ రానేదూ ఆలకి నాను తిండెట్టనేదు. అవన్నీ వదులుకోనే ఇల్ల కొండ చేసుకుంతన్ను" అన్నాడు యెంకన్న

వాళ్ళు అలా మాట్లాడుతుంటే పసిపిల్లలనుంచి ముసిలోళ్ళదాకా అలా చూసు కుంటూ వుండిపోనారు.

"వాళ్ళను ఆదరించేవని తెలిస్తే....కొండకిందికి దిగిపోవాలిసొస్తాది జాగ్రత్త" హెచ్చరించినట్లు మాట్లాడి వెనుదిరిగారు D. S. P. బృందం.

అసలే మందు పాతర్ల రోజులు! అందులోకి కలికాలం! కాకపోతే మరింకేటి అంధ్రా నచ్చలైట్లాట మధ్యప్రదేశ్ అంచుల్లో మందుపాతరపేల్చి మహారాష్ట్రి పారి పోనారట. అందుకే గాబరాగాబరాగా కొండ దిగేసారు.

వాళ్ళు అలా కొండ దిగుతుంటే యెంకన్న దగ్గరనుంచి యెంకన్న పెద్ద కొడుకు సుబ్బారావువరకూ అలాగే ఆగి చూసుకుంటూ వుండిపోయారు.

మళ్ళీ ఎవులో మంట రాజేసారు. సుబ్బారావు గడపలో పరచిన తన పడక దగ్గర కెళ్ళాడు.

తన పడక చూసేసరికి ఆడికి ఏడుపొచ్చింది. అది ఎవులో పోలీసోడు బూటు కాలుతో కుమ్మేశాడు. దాన్ని పట్టుకొని —

"అమ్మా....ఇది చూడే! .... దీనిమీద నాను తొంగోనుకదా....ఉ....ఉఉ.... నాను తొంగోనుకదా!" ఏడిసినట్టు గునిసాడు.

అందరూ దాన్ని చూసారు, అందరికీ బాధనిపించింది.

"అటుండి ఇటు తిప్పేసి పర్చుకోరా" అన్నాది తల్లి.

"నా కోద్దు కదా! నా కొద్దుకదా! నా కింకొకటి కావాలి కదా!" అని గుణుపు పెంటాడు. వాళ్ళమ్మకు ఏం చెప్పాలో అర్థం కావడం లేదు.

"అయ్యో నా కొడుకు తెల్ల బట్టలు కోరాడా? తెల్లటి మెతుకులు కోరాడా! మరొక్క గుడ్డ పాత కోరాడు. ఆడికి ఇవ్వడానికి గుడ్డపాత లేదు. నాను కట్టుకో డానికి గుడ్డముక్క నేదు. పరుసుకుంతే కప్పుకోడానికి లేపు - కప్పుకుంతే - కట్టుకో డానికి నేపు. ఈ దిక్కుమాలిన బ్రతుకులు ఎప్పుడు పోతాయో....అని ఆవిడ ఆలో చించలేదు. ఆవిడ ఆలోచనంతా —

అయ్యో ఇంటిల గుడ్డ ముక్కలు నేని సంగతి ఎప్పుడు తెలుసుకుంటాడో పున్నదాన్తో సర్దుకోడం ఎప్పుడు నేర్చుకుంటాడో అన్నదే ఆవిడ ఆలోచన.

ఇలాంటి ఆలోచనల్లోంచి సిగ్గా మామ యెంకన్న దిక్కుచూసి —
"మ్మామ....అన్నగాల్ని రానివ్వద్దు మామ" అన్నాది. అని తల కిందికి దించుకుంది.

కోడలు తలకిందకి దించుకుందిగాని యెంకన్నకి తల తీస్పేసినట్టయింది. అందరూ పల్లక ఆలోచిస్తున్నారు. యెంకన్న మనుమడు సుబ్బారావు మాత్రం యేడుస్తున్నాడు.

ఇంతలో ఏవో రంగు రంగుల పురుగు మంట దగ్గర కొచ్చింది. సుబ్బారావు ఏడుపుని ఆలమ్మ ఆపలేక పోయిందిగాని, ఆ పురుగు ఆపేసింది.

దాని పట్టుకోడానికి నెగిసాడు. అది తిన్నగెల్లి యెంకన్న తమ్ముడు భార్య అంతే సుబ్బారావుకి చినసాయనమ్మ అవుతాది. ఆవిడ కాళ్ళమీద వాలింది. నెమ్మ దిగా దాన్ని పట్టుకోడానికి చెయ్యి పెట్టాడు.

టపుక్కున ఓ నీటి బొట్టుపడింది. అది నీటిబొట్టుకాదు కన్నీటిబొట్టు. సుబ్బా రావుకి అదోలా అనిపించి వాళ్ళమ్మ దగ్గరకొచ్చి —

"అమ్మా - చిన నాయినమ్మ ఏడుత్తందే" అన్నాడు.

అటుచూడలేక అందరికీ ఏడుపొచ్చింది. యెంకన్నతోసహా అందరికీ గతం గుర్తుకొచ్చింది.

ఇందాకటినుంచి యెంకన్న తమ్ముడు భార్య అంటున్నానే. ఆయమ్మ పెనిమిటి చచ్చిపోనాడు అంటున్నానే అదంతా అబద్ధం. ఆయమ్మ పెనిమిటి చచ్చిపోలేదు. పోలీసులు చంపేశారు. శ్రీకాకుళ పోరాటంలో చనిపోయిన కా॥ గంగన్నే ఆయమ్మ పెనిమిటి.

అందుకే ఏ చిన్న విషయం జరిగినా ఆయన గేపకమొత్తాడు. ఆయన గేపక మొచ్చినప్పుడల్లా అవిడ ఏడుత్తాది. అవిడ ఏడ్చినపుడల్లా పిల్లలా ఏడుత్తారు. గూడంతా ఏడుత్తాది.

గేపకాల్లోంచి తేరుకొని యెంకన్న భార్య —

"ఊఁ....అన్నగార్ని రానివ్వద్దూ!" అన్నాది.

కోడలంటే చిన్నపిల్ల గవాటికి (పోరాటంకి) పుట్టలేదు. అందుచేత కొండల్లో రాజకీయాలు కొత్త. కాని తన పెళ్ళాంకి ఆ రాజకీయాలు కొత్తగాదు. కాని కొత్తగా మాట్లాడితే తను పాతకత చెప్పక తప్పలేదు.

జరిగిన అలజడి నుండి ఎవరికీ నిద్దరరాలేదు. అందరూ అలాగేకూకోని యింతన్నరు. అందరినీ ఉద్దేశించి పెళ్ళాం వైపు చూసి —

"ఓలే... ఆ అన్నగాళ్ళు, అంతే, అప్పుడు కామిరెడ్డిలే (కాంమ్రేడ్‌లే) నేక పోతే మన మిలగుంతామా? ఈ కసింతో కుసింతో గెంజి తాగుదామా? ఈ పాటిదో ఆపాటిదో గుడ్డ కట్టగలమా చెప్పుమీ? —

కర్ర గొడితే కేచు (కేసు) రెమ్మరిత్తే కేదు! పుల్ల ఏరితే కేచు! పింజితెంపితే కేచు! కియ్యమంతే కొడెత్తు రెలిపోయోలు! మాటాడితే మేకెత్తురెలిపోయోలు! గొడ్డ లొట్టుకొని అడివిలోకెల్లి, అలకి కనిపించితే, ఆ గొడ్డలితోనే దెబ్బలు! కడవరికి (చివరికి) ఆ గొడ్డలి నాక్కొని కేచెట్టి కోరుట్ల తిప్పోలు. అడు బొక్కల తోసేమని తీర్పు యిచ్చోడు.

అలాపింటిదీ ఇప్పుడే పారెస్టోడుఅడివిలో కొచ్చి నాక్కొని తిరిగెలిపోగల్లు కొండలనిండ పంటలేచినాము. ఇదెవులువల్ల జరిగింది చెప్పీ....?

ఆలోకపక్క అలగైతే ఇంకొకపక్క పొండోలు, సాపుకార్లు, ఇచ్చిన అప్పులు తీర్చకపోతే, ఉన్ని మడి చెక్క రాసుకుండోలు. ఇంటిలున్న గింజలు వొంపికెలిపోయోలు. అలిట్టమొచ్చిన దేటుకి మన దినుసుకొని దొచ్చికెలిపోయోలు.

అలాపంటిది సంతలోన రేటులు మనం చెప్పినాం పసుపింత, అల్లమింత, ఉ .... కందులింత, మరి....చింతపండు కింతివ్వాలి ఇలగ చెప్పినా, సంతకెలితేనే బితుకు బితుకు మన్నే మనం ఇదంతా ఎపులువల్ల చేసినామే!

ఇవన్నీ చెప్పినోలు చెల్లిపోనారు....మన బతుకులు బాగునేవు ఎపుడునాగీ అయ్యిపోనం అనీసరికి అన్నగాలొచ్చినారు అలురాడం మనకి కట్టమా చెప్పే.... ? అన్నాడు యెంకన్న.

అందరూ అలాగే అన్నారు. యెంకన్న పెళ్ళాంకూడా విన్నాది మళ్ళీ ఇలా అడిగింది.

"అవునూ .... కాయమే.... అవన్నీ చేచిందీ అలే! మన్క కొండ దించేత్త మంతే మన మెలగా బతకాలి చెప్పు....!

నానాలకి తిండెట్టసన్నానా....నే వొప్పితే నానంత పీసుదాన్నా అలకి తిండెట్ట డం నాకిట్టమే .... అల మాటలా ఇట్టమే .... అల పాటలు ఇట్టమే .... గాని అలకి తిండెడితే, పోలీసులు కొడితే, మరెందుకు అలకెట్టాల" అని అడిగింది అమాయకంగా కాదు చాలా ఆలోచించి.

ఏటిచెప్పుతాడా అన్నట్టు చిన్న గుంటడు సుబ్బారావు నుంచి చిన్నాయనమ్మ దాకా అందరూ చూసారు.

"అవునే!.... ఇదిగోయే ఈమంటుందే.... పొగరాకుండా ఈ మంట పత్తా దేటీ? .... ఊది ఊ త్తె పొగంతా పోయి ఎర్రగ ఎలుగుతుందే....

ఉన్నోలు-నేనోలు తేడా నేకుండా అందరను సమంగ అయిపోవాలంతే కవుకులు నేకుండా అయిపోద్దేటీ ?.... ఈ మాత్రం కవుకులు పడకుండా ఏసుకమూ రాదే.

మనకైతే పాకలే దూరతన్ను పాత గుడ్డలే కమ్ముతన్ను, అలు కనబడితే మరిన్ని మాటలు నేకుండ కాల్చేసి సంపిత్తరే" అన్నాడు యెంకన్న.

"అమ్మో అన్నగాళ్ళనై తేసంపిత్తరా" అన్నట్టు గుటక మింగింది కోడలు. యెంకన్న పెళ్ళం కసింత బాధపడ్డాది. సుబ్బారావు అపులింత లేస్తుండగా—

ఇందాకటి మిసుకు మిసుకు లైటు వక్కసారి జిగేమని ఎలిగింది. యెంకన్న కోడలు తన చెయ్యి తానే ముద్దాడుకొంది.

ఆవిడిది నీలకంఠాపురం దగ్గర రోడ్డోర వూరు. ఆ వూర్లో ఒకరిద్దరు ఉద్యోగస్తుల పెళ్ళాలున్నారు. వాళ్ళు ఇలగే కరెంటు వచ్చేసరికి చెయ్యికి ముద్దెట్టుకోవడం చూసినకాసి ఆవిడ అలగే చేస్తుంటాది.

ఇప్పుడిదాకా మినుకు మినుకు మన్న లైటు వక్కసారి ఎలిగేసరికి సుబ్బారావ్‌కి ఆశ్చర్యమేసింది—

"తాతా....ఆ నైటూ....ఎందుకలగ జిగీలుమని బెలిగింది" అడిగాడు.

యెంకన్న సమాధానం చెప్పకముందే యెంకన్న పెళ్ళం తెలిసినట్టగ టపుక్కున అన్నాది— "వతీనుకాటి పైర్లు కలిపేసి వత్తేగేసి వుంతారు. అందుకే బెలిగింది." అన్నాది....

యెంకన్న నవ్వి—

"—అదికాదే పే(ట్రీలు....మిల్లులు మిసన్లోలు ఇప్పుడుదాకా కరెంటు ఆపుకొని పనులు చేసుకు(ను. అలి ఆపేసిన తర్వాత....ఇదిగో ఈలు తొంగుండిసరికి ఇక్కడి కెలిపొచ్చింది"— అన్నాడు. సుబ్బారావ్‌కి మరొక సందేహమొచ్చింది— "మన గూడకి ఎప్పడొత్తాదో ?....ఈ కరెంటు" అన్నాడు.

ఆపెసిని యెంకన్న గుండికాయ పిసికి నట్టగయింది—

"వత్తాదిరా మళ్ళీ రత్తం పారితే వత్తాదిరా ! రాక మానాదా ! మన గూడకే కాదు మన పోడు మీద గుడిసికి కూడా వత్తాదిరా !

అప్పుడు వందల మంది తూటా తుపాకులకి బలైపోతే అదొచ్చిందిరా ! అదేకాదు ఈ రోడ్లూ, కరెంటు, అంగలబడి, కారపరేషన్లు అన్నీ వచ్చినాయి.

తిరగబడినట్టగ కనబడినోడికి బొక్కల తోసేనారు. పల్లకునోనికి మళ్ళీ తిరగబడకుండా ఇవి ఇచ్చినా(రా....గుద్దకాడ సిక్కసి ఉయ్యాలూపినా(రా....

అవి బెలుగుతన్నయంతే.... అందల రత్తముందిరా.... అందల పేణ ముందరా అందకొండల బట్టేసిన మన జాతోలు ఏడుపుందిరా....

ఓరే సుబ్బా ! మీ యమ్మని కుడిచేత్తోటి సంపేసి, ఎడమచేత్తోటి పాలిచ్చి తాగమంటే తాగుతావరా నువ్వూ....? అలగే చేసినా(రా. సంపేసి సాపుకర్చు ఇచ్చినా(రా— ఏనికిరా మనకవి ? ఆ రోడ్డులమీద మన బళ్ళు తిరగాలా? మన బక్కలు తిరగాలా ?

అదిగో ఇప్పుడొచ్చినట్టగ ఆ జవాన్లు జయ్యిమని రాడానికి, జయ్యిమని పోడానికే ఏసినార్రా....వెలగని తంబా వేసినారు....ఏలరా అవీ పగడాలు కొడుకు పారియ్యి చెయ్యి చుట్టీడానికే....ముసిలోలు చీకట్లోన ముంజూరు దూరొత్తే బుర్రలు పగిలి పోడానికిరా....

వద్దురా మీ చినతాతని చంపీసిన ఆ కరెంటు ! మనకొద్దురా నాకు జెయిలు పాలజేసి మీకు దిక్కునేనోల్ని జేసిన ఆ కరెంటు మనకొద్దురా" మన బారిడి మేష్టర్ని చంపేసి, మనచేతి లెట్టిన ఆ కరెంటు మనకొద్దురా" అన్నాడు. ఎంతో బాధగా.... కోడలికి ఏదో గుర్తుకొచ్చింది—

"మ్మామా.... నీలకంఠాపురం సోములికి అప్పుడే పంపీసినారు కదమామా" అన్నాది. వాళ్ళమ్మ ఎపుడూ సోములు గురించే చెప్పేది. గబగబొచ్చి తినేసి ఎలి పోయడని, ఎప్పుడూ పోలీసులు వెలికోలని చెప్పేది. అందుకే అలగ అడిగింది.

"అవునూ.... అగవాటా కడవర్లోన చంపీసినారు.... ఆడు మన కొంతమీదో లికి గురువు లాటోడు. ఆడంతే ఇప్పుడొచ్చిన నాటోలు పదొంతులైనా ఉచ్చలు బోసు కునోలు" అన్నాడు గతం గుర్తుచేసుకుంటూ—

నోరొదిలేసి వింటున్న సుబ్బారావు ఒక్కసారి—

"అంతే మన జాతోలందరినీ ఒక దగ్గర కూకుండబెట్టి బడి చెప్పోడా ?" అన్నాడు యెంకన్న నవ్వి—

"బడి చెప్పినోలందరూ గురువులు కాదురా....ఆలందరూ 'కూడునేదు గురువా అంతే పులుసేసుకొని బుక్కిమన్నోలే'. అన్నం ఎలా తేవాలో చెప్పర్రా. నెలకో పాలొచ్చి అచ్చర మెలాగదిద్దాలో చెప్పుతార్రా....

గుర్వులంతే గుర్వులు....అపులు గుర్వులురా— వెంపల్లి సత్తిం గుర్వు (వెంపటాపు) ! కారోల్ల కైల్సం గుర్వు ! మేరింగి చిన్నమనాష్టు గుర్వు....ఇంకా ....తుల్సాలన నాయిడోల్సలో అయిదుగుర్ని చంపేసి తిరిగొత్తుండగా దొర్కి పోయిన మేడొరపు రవనమూరితి గుర్వు. అంతేగాని బడి చెప్పేసిన ప్రతీవక్కడు గురువైపోడు". అనీసి మంచంకోడి పక్కన చుట్టపీకకోసం తడిమాడు—

అదక్కడ నేదు. సోవ్వాకు కేజి డబ్బీ రూపాయలు అయితే కేవొచ్చినప్పు డల్లా ఒక బుక్క పీలుత్తానంతే ఎక్కడ తేగల్దు పక్కమంచమీదున్న కొడుకు చుట్ట పీల్చాడు. 

ఉర్దూ కథ :

# చౌతీ కా జౌరా

## ఇస్మత్ చుగ్తాయ్

సెహ్‌దాతి*లో చెక్క దివాన్ మీద మళ్ళీ ఒక శుభ్రమైన బట్ట పరిచి ఉంది. వరండా మీద పగిలిపోయిన పెంకుల్లో నుంచి సూర్యకాంతి లోపల పరచుకుంటోంది. ఇరుగు పొరుగు అమ్మలక్కలందరూ మౌనంగా కూచున్నారు. దేనికోసమో ఎదురు చూస్తున్నట్టున్నారు. ఏదో తీవ్రమైన సంఘటన జరగబోతున్నట్టుంది. తల్లులు పిల్లలను ఒడిలో పడుకోబెట్టుకుని పాలిస్తున్నారు. పాలు అందనప్పుడల్లా ఎవరో ఒక శిశువు ఏడుపు మొదలుపెడుతోంది.

"చ్చొ....చ్చొ.... నా బంగారుకొండా"

అంటూ తల్లి బిడ్డను తన మోకాళ్ళమీద పెట్టుకుని ఊపుతోంది. సన్నగా, ప్రాణం లేనట్టుందా తల్లి. బిడ్డను ఊపుతుంటే, బియ్యంలోంచి ఊక చెరుగుతున్నట్లుగా ఉంది. పిల్లలు రాగాలు తీస్తున్నారు.

ఇవాళ కుబ్రావాళ్ళమ్మ ముఖంలోకి చాలమంది ఆశగా చూస్తున్నారు. పెళ్ళికూతురి ఎర్రనేత గుడ్డలో రెండు సన్నటి పెడల్పు ముక్కలు కలిపి కుట్టడం అయిపోయింది. కాని ఇంకా తెల్ల అంచును కత్తిరించడానికి మాత్రం ఎవరూ పూనుకోలేదు. బట్టలు కత్తిరించడంలో కుబ్రావాళ్ళమ్మ చాల నేర్పరి. ఆ ముడతలు పడిన చేతులు ఎన్ని మధుపర్కాల్ని తయారు చేశాయో, ఎన్ని పొత్తిళ్ళ బొంతలు కుట్టాయో, ఎన్ని శవ వస్త్రాల్ని తయారుచేశాయో లెక్కలేదు. ఆ చుట్టుపట్ల ఎవరి దగ్గర గుడ్డ తక్కువబడినా, బట్టలు కుట్టే ప్రయత్నాలు విఫలమైనా వెంటనే కుబ్రావాళ్ళమ్మ దగ్గరికి వచ్చేస్తారు. ఆమె ఆ గుడ్డ మూలలూ, ముడతలూ సరిచేస్తుంది. త్రిభుజాకారంలో మలుస్తుంది. చతురస్రంగా మలుస్తుంది. ఎటువైపు నుంచి కత్తిరించాలో ఆలోచిస్తుంది. కళ్ళతోనే కొలుస్తుంది. నిర్ణయిస్తుంది. అప్పుడామె ముఖంమీద ఒక చిరునవ్వు వెలుగుతుంది.

---

* వరండాను అనుకొని ఉండే మహిళల గది.

"లంగా కుట్టడమూ, చేతులు కుట్టడమూ సమస్యకాదు. మెడల దగ్గర ముక్కా బఖ్చాలోంచి కుడతాను" అని ఆమె అన్నదంటే సమస్య పరిష్కారమైపోయి నట్టే. ఆమె ఆ గుడ్డ కత్తిరించి, కత్తిరించిన ముక్కలన్నీ కట్టగట్టి వెనక్కి ఇచ్చేస్తుంది.

కాని ఇవాళ తెల్లంచుకోసం తెచ్చిన గుడ్డ చాల చిన్నది. ఇవాళ ఆమె నైపుణ్యం కూడ పనికిరాదని అందరూ అనుకున్నారు. అందుకే అందరూ ఊపిరి బిగబట్టుకుని ఆమెవైపు చూస్తున్నారు. అయితే ఆమె ముఖంలో మాత్రం నిండా విశ్వాసం ఉంది. ఆందోళన ఛాయలే లేవు. పావుగజం ఉన్న ఆ అంచుగుడ్డను ఆమె కళ్ళతోనే మౌనంగా కొలుస్తోంది. పాలిపోయి లేత నీలంరంగులో ఉన్న ఆమె ముఖం మీద ఎర్రగుడ్డ ప్రతిఫలిస్తుంటే అస్తమిస్తున్న సూర్యకాంతిలా ఉంది. కారుమేఘాల మధ్య నుంచి వెలుగు ఉబికినట్టు, కీకారణ్యం హఠాత్తుగా మండిపోవడం మొదలయినట్టు ఆమె ముఖంమీద విచారం నిండిన లోతైన ముడతల్లో కాంతి వ్యాపించింది. చిరునవ్వు నవ్వుతూ ఆమె కత్తెర చేతుల్లోకి తీసుకుంది.

చుట్టూ కూచున్న స్త్రీలందరూ నిట్టూర్పు విడిచారు. పసిపాపల్ని నేలమీద వదిలేశారు. పెళ్ళికాని యువతులు బాణాల్లాంటి చూపులతో శ్రద్ధగా కుడుతున్నారు. నవవధువులు వేళ్ళకు అంగుష్ఠం తొడుక్కుని పనిచేస్తున్నారు. కుబ్రావాళ్ళమ్మ కత్తెర పనిసాగుతోంది.

సెహ్‌దారిలో ఆ మూలన ఓ చిన్న నులకమంచం పట్టెమీద హమీదా కూచుని ఉంది. ఆమె కాళ్ళు కిందికి వేలాడుతున్నాయి. దోసిట్లో గడ్డం ఆనించుకుని ఏవో ఆలోచనల్లో మునిగిపోయి ఉంది.

ప్రతిరోజూ మధ్యాహ్నం, భోజనాలయిపోయింతర్వాత అమ్మ ఇట్లాగే ఇదే సెహ్‌దారిలో, అదే చెక్క దివాన్‌మీద, సరిగ్గా ఇట్లాగే కూచుంటుంది. ఆమె తన బఖ్చా తెరిచి, చుట్టూ రంగు రంగుల గుడ్డముక్కలు పరుచుకుంటుంది. హమీదా అక్క కుబ్రా నీళ్ళతొట్టి పక్కన కూచుని గిన్నెలు, పళ్ళాలు కడుగుతోంది. మెరుస్తోన్న ఎర్రగుడ్డను కళ్ళ చివర్లలోంచి చూస్తోంది. పాలిపోయిన ఆమె గోధుమ

• గుడ్డలమూట

రంగు ముఖంమీద హఠాత్తుగా ఎర్రవెలుగు మెరుస్తోంది. అమ్మ జరీఅంచు గుడ్డను విప్పి జాగ్రత్తగా తన మోకాళ్ళమీద పరుచుకుంది. ఆమె ముడతలు తేరిన ముఖం ఏదో ఒక ఆకాంక్షతో, ఒక కోరికతో వెలిగిపోయింది. ముఖం మీదికి టార్చ్‌లైట్ వేసినట్టుగా ఆమె ముఖంమీద ముడతలు లోలోతుల్నించి వెలిగిపోయాయి. ప్రతి కుట్టుమీద లాంతరు వెలుగు ఆడినట్టు జరీ కుట్టుపని తళతళలాడింది. ఇది ఇట్లా కుట్ట డానికి ఎన్నిరోజులు పట్టిందో భగవంతుడికి తెలుసు. చివరికది శవపేటికల్లాంటి పెట్టెల్లో అట్టడుగున భద్రంగా ఉండిపోయింది. కాలం గడిచినా కొద్దీ వెండిదారం మాసిపోయింది. తళతళలాడే బంగారు తీగలు మెరుపు పోగొట్టుకున్నాయి.

ఎందుకంటే కుబ్రా వివాహ ఉత్సవం జరగనేలేదు. ప్రతి మధుపర్కమూ వెలిసిపోగానే, రంగు మారిపోగానే దాని ప్రాధాన్యత పోగొట్టుకునేది. దాన్ని పక్కన పెట్టేసేవారు. మామూలుగా ఇచ్చే అరణంలో కలిపేసేవారు. వివాహపు నాలుగో రోజున ప్రత్యేకంగా అలంకరించే మధుపర్కం, చౌతీ కా జోరా, మళ్ళీ కొత్తగా తయారయ్యేది. ప్రతి కొత్త దుస్తుల తయారీతో కొత్త ఆశలు మోసులెత్తేవి. ఆ చిర పరిచితమైన దివాన్‌మీద శుభ్రమైన తెల్లగుడ్డ పరిచేవాళ్ళు. ఇరుగు పొరుగు అమ్మ లక్కలందరూ గాజులు గలగల లాడిస్తూ, పిల్లలను చంకనేసుకుని, చేతుల్లో తమల పాకులు పట్టుకుని వచ్చేసేవారు.

---

→ అపుళ్ళ తీసుకుంటూ లేచిపోయింది. యెంకన్న భార్య లేస్తూ— "ప్వేటో.... పడినన్ని కపుకులు పడినా ఈసారైనా గెలిస్తే బాగు" అన్నాది.

"అదెపులు చెప్పగల్రు! కిందపేడు కొండమీద కందులు జల్లినామంతే - పండనేదు, మరియ్యేడు మానీసినామేటి ?, ఈ య్యేడు పండిపోతే, మళ్ళీ ఏడు మానిత్తమేటి !.... పండిన్దాకా ఏత్తాం ! ఒక్కసారి ఓడిపోనమని మానెత్తమేటి ? గెలిచిందాకా దెబ్బలాడతాం !" అనీసి గట్టిగ ఓ పీల్పు పీల్చాడు చుట్ట ఎర్రగెలిగింది.

ఎటోలటో లెగిసెల్లి తొంగుండిపోనారు.

'అన్నగాళ్ళ ఏ కొండమీదున్నారో .... ఏరాళ్ల మీదున్నారో .... తిండి తిన్నారో.... లేదో.... ఈసారి అన్నగాలొత్తే ఎక్కువ తుమ్మికపళ్ళ తెంపీసి ఇత్తాను' యెంకన్న కోడలు ఆలోచిస్తూ తొంగుండిపోయింది. ○

"కట్టడానికి సరిపోతుంది గాని, అతుకేయడానికి సరిపోదు" అని సామెత ఉందిగదా.

"వినండి.... వినండి.... అయితే, అతుకువేయడానికి ఎర్రనేతగుడ్డ వాడతానంటావా ?"

ఆ మాటతో అందరి ముఖాల్లోనూ విచారం అలుముకుంది. కుబ్రా వాళ్ళమ్మ రసవాదిలాగా పూర్తి నిశ్శబ్దంగా కళ్ళతోనే ఆ గుడ్డ పొడుగు వెడల్పులు కొలిచింది. అప్పుడు ఎవరో ఒకరు బ్రా గురించి గుసగుసలాడారు. పెద్దగా నవ్వారు. మరొకరెవరో పెళ్ళిపాటలు పాడడం మొదలుపెట్టారు. ఒకరు అన్నిటికీ తెగించినట్టుగా పిల్ల అత్తవారింటి గురించి కొంటెవ్యాఖ్యలేవో చేశారు. ఇక అందరూ ఒకరినొకరు గేలి చేసుకుంటూ రెండర్థాల మాటలు అనుకున్నారు. అటువంటి సందర్భాల్లో పెళ్ళికాని అమ్మాయిల్ని బైటికి పంపించేసేవాళ్ళు. తలనిండా ముసుగు వేసుకొమ్మని చెప్పేవాళ్ళు. లోపలినుంచి తుళ్ళింతలు వినబడ్డప్పుడల్లా ఈ అమ్మాయిలు నిట్టూర్పులు విడిచేవాళ్ళు. తమకూ పెళ్ళయి, ఆ ఉత్సవంలో పాలుపంచుకునే రోజు ఎప్పుడొస్తుందో అని ప్రార్థించేవాళ్ళు. ఈ గందరగోళానికి దూరంగా కుబ్రా సామాన్ల కొట్టులో దాగి ఉండేది. ఆ గదినిండా దోమలు నిండి ఉండేవి. ఈ మధ్యలోనే కత్తిరింపుల కార్యక్రమం ముఖ్యమైన మలుపుకు చేరేది. ఒక్క ముక్క పొరపాటుగా కత్తిరించినా స్త్రీలందరూ ఆందోళన పడేవాళ్ళు. ఏమి జరగనున్నదో అని భయపడుతూ కుబ్రా తలుపు సందులోంచి తొంగిచూసేది.

నిజంగా అదే విషాదం. దుస్తుల్లో ఒక్కదాన్ని కూడ ప్రశాంతంగా, ఆందోళన లేకుండా కుట్టడం జరగలేదు. బట్టల్లో ఎక్కడ పొరపాటు జరిగినా తీవ్రమైన పరిణామాలుంటాయని నమ్మేవాళ్ళు. మధ్యవర్తి ప్రయత్నాల్ని ఎవరో ఒకరు చెడగొడతారనిపించేది. కాబోయే వరుడికి అప్పటికే పెళ్ళయిపోయిందని అందరికీ తెలిసిపోయేది. లేదా అతని తల్లి మంచి బంగారు గాజుల జత అడిగేది. దుస్తుల్లో ఏ మాత్రం వంకర ఉన్నా మెహర్ సరిపోలేదని వాదన జరిగేది. లేదా కట్నంగా మంచి వెండి కోళ్ళున్న మంచం కావాలని అడిగేవాళ్ళు. చౌతీ కా జొరా శకునం చాల సున్నితమైనది. చాల ముఖ్యమైనది. వాళ్ళ తల్లికి ఎంత నేర్పు ఉన్నా, ఎంత పనితనం ఉన్నా ప్రతిసారీ ఎక్కడో పొరపాటు జరుగుతూనే ఉండేది. ప్రతిసారీ తప్పనిసరిగా

ఉన్న సమస్య, స్వల్పాతిస్వల్పమైన, ప్రాముఖ్యంలేని సమస్య పర్వతమంత పెరిగి పోయేది. కుబ్రాకోసం కట్నం సేకరించడం ఎప్పుడో కుబ్రాకు ఖురాన్‌లో మొదటి పాఠాలు చెప్పినప్పుడు మొదలయింది. ప్రతి చిన్న గుడ్డ ముక్కను సేర్పుగా ఉపయోగించేవాళ్ళు. దానితో ఏదో ఒకటి చేసేవాళ్ళు. ఆ గుడ్డ ముక్కతో కుట్టు సంచీనో, అద్దానికి తొడుగునో తయారుచేసేవారు. దానికి వెండి. బంగారు జరీ అలంకారాలు చేసేవాళ్ళు.

"ఈ అమ్మాయిలు ద్రాక్షతోటల్లాగ గబగబా పెరిగిపోతున్నారమ్మా ! పెరగట్లేదూ ?"

కుబ్రాకు పెళ్ళికావాలంటే, మధుపర్కం గురించి ఆలోచించడం, తయారు చేయడం చాలా ముఖ్యం అని అమ్మ అనుకునేది. నాన్న చనిపోయాక ఈ సమస్య మరీ జటిలమై పోయింది.

హమీదా వాళ్ళ నాన్నను గుర్తుతెచ్చుకుంది.

ఆయన సన్నగా ఉండేవాడు. శరీరంలో ప్రతి ఎముకా బయటికి కనబడుతుండేది. పీరీలాగ పొడుగ్గా ఉండేవాడు.... ఒకసారి ఒంగాడంటే మళ్ళీ నిటారుగా నిలబడడం కష్టమయ్యేది. ప్రతిరోజు పొద్దున్నే కొత్త వేపపుల్ల నోట్లోవేసుకుని, హమీదాను ఒడిలో కూచోబెట్టుకుని కూచునేవాడు. పళ్ళు తోముకుంటూ ఎక్కడో ఆలోచనల్లో మునిగిపోయేవాడు. ఏమి ఆలోచించేవాడో భగవంతుడికే తెలియాలి ! వేపపుల్ల పీచు గొంతులో తట్టుకుని దగ్గడం మొదలెట్టేవాడు. హమీదాకు కోపంవచ్చి ఒడిలోంచి బైటికి దూకేసేది. దగ్గేటప్పుడు ఆయన వణికిపోతుంటే హామీదాకు నచ్చేది కాదు. హమీదా కోపాన్ని చూసి ఆయన నవ్వేవాడు. దానితో ఆయన దగ్గు గుండెల్లో సుళ్ళు తిరుగుతున్నట్టు, ముడిబడుతున్నట్టుండేది. గుండెలోపల తలలు తెగిన పావురాలు రెప రెపలాడుతున్నట్టుండేది. అమ్మ పరుగెత్తుకొచ్చి వీపుమీద గబగబారాసి రుద్దీ మళ్ళీ శ్వాస సరిగ్గా ఆడేలా చేసేది.

"అయ్యో భగవంతుడా - ఎందుకట్లా నవ్వాలి ?" అనేది.

ఆయన నిస్సహాయంగా నవ్వేవాడు. గొంతు అద్చుకుపోయేది. కళ్ళు ఎర్రనయ్యేవి. చిట్టచివరకు దగ్గు ఆగిపోయాక, మళ్ళీ శ్వాస సరిగ్గా ఆడుతుండగా దీనంగా చిరునవ్వు నవ్వేవాడు.

"ఈ దగ్గు కేమన్నా మందు తెచ్చుకోరాదూ, ఎన్నిసార్లు చెప్పాను నీకు?"

"ఆస్పత్రిలో డాక్టర్ సూదిమందు వేయించుకోమన్నాడు. ప్రతిరోజూ గ్లాసుడు పాలుతాగమన్నాడు. అరటౌన్సు వెన్న తినమన్నాడు".

"ఆ డాక్టర్ల మట్టిలో గలువ! నువ్విట్లా దగ్గుతుంటే నిన్ను వెన్న తిన మంటారా? ఆ కొవ్వుతో నంజు పెరగదూ? అసలు నన్నడిగితే ఆయుర్వేద వైద్యుణ్ని కలవడం మంచిది".

అప్పుడాయన మళ్ళీ తన హుక్కా పీల్చడం మొదలెట్టేవాడు. మళ్ళీ ఊపి రాడేది కాదు.

"ఆ హుక్కాను అవతల పారేస్తాను. ఆ దరిద్రపుగొట్టుదే నీకు దగ్గు తెప్పి స్తోంది. నీ కసలు నీ కూతురికి పెళ్ళీడు వచ్చిందన్న స్పృహ ఉందా అని?"

అప్పుడాయన దయ చూపమన్నట్టుగా కూతురు కుబ్రా వేపు చూసేవాడు. కుబ్రా ఇంకా చిన్న పిల్లే. కాని ఎప్పుడు పెద్దమనిషయిపోయిందో ఎవరికి తెలుసు? ఖురాన్ లోని మొదటి మాటలు చదివిన రోజే ఆమె యవ్వనంలోకి ప్రవేశించినట్టుగా ఉంటుంది. ఆమె యవ్వనం ఎటువంటిది? ఆమె తన కళ్ళలో ఎప్పుడూ నక్షత్రాలు వెలిగించుకో లేదు. ముంగురుల్ని చెంపలమీద ఎగరనివ్వలేదు. ఆమె ఎన్నడూ తన ఉద్వేగాల్ని వెల్లువలు కానివ్వలేదు. ఎప్పుడూ ప్రేమికుల్ని కోరుకోలేదు. వర్షాకాలంలో ఆకాశంలో కారుమేఘాలు కమ్ముకున్నప్పుడు కూడ ఆమె ప్రేమికుడు కావాలని ఆశించలేదు. ఆమె ఎప్పుడూ ధ్యానంలో ఉన్నట్టుండేది. ఎప్పుడూ ఏదో వేదనకు గురయినట్టుండేది. అట్లా ఆమె మీదికి పాకి వచ్చిన పిరికి యవ్వనం, కిక్కిరిసిన యవ్వనం ఎంత తెలియకుండా వచ్చిందో అంత తెలియకుండానే వెళ్ళిపోయింది.

నాన్న ఒకరోజు మెట్లమీద పడిపోయాడు. ఏ డాక్టర్ చికిత్సగాని ఆయనను ఈ దెబ్బనుంచి కోలుకునేట్టు చేయలేకపోయింది. ఇప్పుడిక హమీదా తియ్యటిరొట్టె కావాలని ఏడవడం మానేసింది. కుబ్రాకిక ఏ పెళ్ళి సంబంధాలూ రాలేదు. ఆ తట్టు పరదా వెనుక ఇద్దరు అమ్మాయిలున్నారనీ, వారిలో ఒకరు యవ్వన ప్రాంగణం దాటుతున్నారనీ, మరొకరిలో యవ్వనం పడగ విప్పుతున్న తాచుపాములాగ ప్రమాద కరంగా మేల్కొంటున్నదనీ ఎవరికీ తెలియదు.

కాని అమ్మ దినచర్యేమీ మారలేదు. ప్రతిరోజు మధ్యాహ్నమూ ఆమె సెహ్ దారిలో కూచుంటూనే ఉంది. చుట్టూ రంగురంగుల గుడ్డ ముక్కలు పోసుకుని పెళ్ళి ఆట ఆడుకుంటూనే ఉంది. ఒకసారి ఆమె కొన్ని డబ్బులు పొదుపుచేసి ఏడున్నర రూపాయలు పెట్టి క్రేప్ గుడ్డ కొంది. అప్పుడది కొనడం అత్యవసరం. కుబ్రా మేనమామ నుంచి ఓ టెలిగ్రాం వచ్చింది. మన్నాడు రైల్లో ఆయన కొడుకు రాహత్ వస్తున్నాడట. ఆయనకేదో పోలీసు ట్రైనింగ్ ఉందట. కూతురి వివాహ ఊరేగింపు వాకిట్లోకి వచ్చేసిందన్నంతగా అమ్మ కంగారుపడింది. అప్పటికింకా వధువు తలమీద చల్లడానికి బంగారు జలతారు సిద్ధం చేయలేదుగదా అనుకుంది. తబ్బిబ్బయిపోయి ఆ కంగారులో ఏం చేయాలో తోచక తన మంచి నేస్తం అయిన పిన్నిని పిలిపించింది. ఆమె బుందోవాళ్ళమ్మ. "నువు ఉన్నపళాన బయల్దేరి రాకపోతే నా శవాన్నే చూస్తావు" అని కబురుపెట్టింది అమ్మ.

వాళ్ళిద్దరూ కుట్ర చేస్తున్నట్టుగా గుసగుసలాడుకున్నారు. అప్పుడప్పుడు కుబ్రావేపు చూపులు సారించారు. కుబ్రా ఎప్పటిలాగే వరండాలో కూచుని బియ్యం కడుగుతోంది. వాళ్ళేమి మాట్లాడుకుంటున్నారో కుబ్రాకు స్పష్టంగానే తెలుసు. అక్కడికక్కడే అమ్మ తన బంగారు చెవులు కమ్మలుతీసి చెల్లెలి కిచ్చేసి అమ్మి పెట్టమంది. ఎట్లాగైనా సరే సాయంత్రానికల్లా తనకు మెరిసిపోయే బంగారు లేసు, జరీ దారాలు, మంచి బంగారు అంచులు, పావుగజం ఎర్రనేత గుడ్డ తెచ్చిపెట్టమని చెప్పింది. ఇంటికి వైటివైపున్న గదిని శుభ్రం చేసిపెట్టారు. కుబ్రా సున్నం కొనుక్కొచ్చి ఆ గదిలో తానే వెల్లవేసింది. గది అయితే తెల్లగా మెరిసిపోయింది గాని, ఆమె చేతులమీంచి చర్మం ఊడి రావడం మొదలయింది. సాయంత్రం ఆమె మసాలా నూరుతోంటే ఆ మంట బాగా తెలిసింది. ఆ రాత్రంతా ఆమె కంటి మీద రెప్ప వాల్చలేదు. అటూ ఇటూ దొర్లుతూ, కదులుతూ ఉండిపోయింది. ఒక వైపు చేతుల మంట, మరోవైపు మన్నాడుదయం రైల్లో రాహత్ వస్తున్నాడనే ఆలోచన.

"అల్లా....నా ప్రియమైన అల్లా - ఈ సారయినా అక్క అదృష్టం ఫలించేలా చూడు. నీకు వందసార్లు దండం పెడతాను" అని ఆ రోజు పొద్దున ప్రార్థన చదివే టప్పుడు హమీదా అనుకుంది.

రాహత్ వచ్చేటప్పటికే కుబ్రా తన దోమలు నిండిన సామాన్ల కొట్టులోకి

వెళ్ళిపోయింది. రాహత్ కడుపునిండా ఫలహారంచేసి, తన గదిలోకి వెళ్ళిపోయిన తర్వాతనే కుబ్రా తనకొట్టులోంచి బైటికి వచ్చింది. మెత్తగా, వధువులాగ నడుస్తూ, ఆ ఫల హారపు బల్లను శుభ్రం చేయడం మొదలెట్టింది.

"అక్కా - అవన్నీ నేను కడిగేస్తానులే" అంది హామీదా కొంటెగా.

"అక్కర్లేదులే" అంటూ కుబ్రా సిగ్గుతో తలవంచుకుంది. హామీదా అక్కను ఇంకా ఉడికించింది. అమ్మేమో చిరునవ్వు నవ్వుతూ నేర్పుగా వెండి జరీ అంచు కుడుతూ ఉండిపోయింది. మొదట ఆమె చెవి కమ్మలజత అమ్మేసింది. ఆ తర్వాత చెవిపోగుల జత అమ్మేసింది. ఆ తర్వాత వంతు వెండి కడియాలది. ఆ తర్వాత నాలుగు గాజుల్ని కంసాలి దగ్గరికి పంపించేశారు. ఆమె భర్త చనిపోయినప్పుడు పుట్టింటివారు పెట్టిన గాజులవి. రాహత్ పరాటాలతో, మాంసం ఉండలతో, పిలావ్ బియ్యంతో, మంచి మాంసంతో విందులు కుడుస్తుండగా వాళ్ళు రొట్టెనీళ్ళతో కాలం గడిపారు.

ఇంత ఖర్చు ఎందుకు పెట్టాలని హామీదా గొణుగుతుంటే ఒకరోజు అమ్మ "రోజులు బాగా లేవు తల్లీ" అని జవాబిచ్చింది. "మనమేమో ఆకలితో పస్తులుంటూ ఆయనకు మంచి తిండి పెడుతున్నాం. అక్క రోజూ పొద్దున్నే లేచి యంత్రంలా పని చేస్తోంది. ఆయనకోసం ఫలహారం తయారుచేస్తూ తాను మాత్రం పచ్చి మంచి నీళ్ళతో గడుపుతోంది. పరాటాలు, పొరలు పొరలుగా పిండివంటలు వెన్నరాసి వేయిం చిన తినుబండారాలు, పాలు, మీగడలు ఎన్నో ఆయన ఫలహారం. అక్క తన ఒంట్లోంచి కొవ్వుతీసి, పరాటా పొరలమధ్య రాసి ఇవ్వగలిగితే ఆ పనికూడ సంతో షంగా చేసేదే. అయితే ఏం, ఏదో ఒక రోజు ఆయన అక్కను పెళ్ళి చేసుకుం టాడు. అప్పుడిక ఆయన సంపాదనంతా అక్కదే. ఎవరయినా తమకు పళ్ళందించే చెట్టుకే నీళ్ళు పోస్తారు గదా. చెట్టు వికసించే రోజున, కొమ్మలనిండా గుత్తులు గుత్తులుగా పళ్ళు వేలాడే రోజున, ఇవాళ మా అక్కను వేళాకోళం చేస్తున్న వాళ్ళం దరి తిక్క కుదురుతుంది" అనుకునేది హామీదా.

పెళ్ళి చేసుకోవడం, సంతోషంగా జీవించడం అనే ఆలోచనే కుబ్రాముఖంలో వధువు ముఖంలోలాగ మెరుపునూ, వెలుగునూ తీసుకొచ్చేది. ఆమె చెవుల్లో షహ

నాయీ మంగళధ్వని వినబడేది. ఆమె రాహత్ గదిని ఎంతో శ్రద్ధగా శుభ్రం చేసేది. ఆయన బట్టల్ని ప్రేమమయ హస్తాలలో మడతలు పెట్టేది. ఆ బట్టలు తనకేదో చెపుతున్నట్టు భావించేది. మురికి పట్టిన షేవోళ్ళనూ, కంపుకొట్టే లోపలి ఉడుపులనూ, చీమిడితో నిండిన జేబు రుమాళ్ళనూ ఉతికేసేది. ఆయన దిండు గలేబుల మీద "సుఖస్వప్నాలు" అని ఎంబ్రాయిడరీ చేసేది. ఆ దిండు గలేబులు కొబ్బరి నూనె వాసన వేస్తుండేది. కాని ఇంత ప్రత్యేకత చూపించే ఏ చర్యాకూడ ఆయన వైఖరిలో మాత్రం మార్పు తేలేకపోయాయి. పొద్దున్నే చాల తీరిగ్గా ఫలహారంచేసి పని మీద వెళ్ళి పోయేవాడు. సాయంత్రం వచ్చి భోంచేసి పడుకోవడానికి తన గదికి వెళ్ళి పోయేవాడు అంతే.

పిన్ని అమ్మ చెవిలో ఏదో గుసగుసలాడింది. అమ్మ తన సంజాయిషీ ఇచ్చుకుంది.

"ఆ పిల్లాడికి చాల సిగ్గు"

"సరే. అయినా ఆయనకు అటువంటి ఉద్దేశ్యం ఉందని ఏదో ఒక సూచన ఉండాలి గదా. ఎంత చిన్న సూచనైనా సరే, ఆమె వైపు చూసే చూపుల్లోనైనా తెలియాలి గదా...."

"అయ్యయ్యో- నా కూతురు అటువంటిది కాదమ్మా.... ఆయన ఇంతవరకూ అమ్మాయి వేపు చూడనే లేదు" అమ్మ కొంచెం గర్వంగానే చెప్పింది.

"పిల్ల వెళ్ళి ఆయనను కలుసుకోవాలని నేనూ అనడం లేదు. అది కాదు నా ఉద్దేశ్యం. అబ్బ-అక్కా- నువు గమ్మత్తుగా మాట్లాడతావులే. నేను చెప్పేదదీ కాదు. కాని ఈ చిన్నమ్మాయి ఉంది చూడూ. అది ఏమీ ఉపయోగపడదంటావా? ఏమే అల్లరి పిల్లా, మీ కాబోయే బావతో మాట్లాడవా ఏం? పలాచికాలాడు, బనాయించు, స్నేహం కట్టడానికి ప్రయత్నించు".

"నేనెట్లా చెయ్యను పిన్నీ ?"

"మొదలాయనతో మాటలు కలుపు. బాతాఖానీ వేసుకో".

"అబ్బ నాకు సిగ్గేస్తుంది. నేను మాట్లాడలేను".

"పిచ్చిపిల్లా ఆయనేమన్నా తినేస్తాడా ఏం?" అంది అమ్మ కోపంగా.

"సరే....కాని" హమీదా ఇంకేమీ మాట్లాడలేకపోయింది. అప్పుడిక వాళ్ళు

ఆలోచనలు చేశారు. చాలసేపు చర్చించి, రాహత్ మీద ఒక పరిహాసమాడాలని నిర్ణయించారు. అది విని అక్క కూడ చిరునవ్వు నవ్వింది. "నవ్వావంటే మొత్తం చెడిపోతుంది'' అని గొణిగింది.

"నవ్వను'' అని హామీదా నమ్మకంగా చెప్పింది.

*　　　*

ఆ సాయంత్రం ఆయన పని నుంచి తిరిగి రాగానే, నేనాయనకు భోజనం పళ్ళెం తీసుకువెళ్ళాను. ఆయన చేతులు కడుక్కుంటుండగా జాగ్రత్తగా పళ్ళెం బల్లమీద పెట్టాను. ఆయన చేతులు కడుక్కుంటున్నంతసేపూ నన్ను పైనుంచి కింద దాకా తేరిపారజూస్తున్నాడు. ఆయనట్లా చూస్తుంటే నాకెంత సిగ్గేసిందంటే, గుండె దడదడలాడుతుండగా, గది లోంచి బైటికి పరుగెత్తుకొచ్చేశాను. అమ్మో-ఆయన కళ్ళు దయ్యం కళ్ళలా ఉన్నాయి!

"ఏమైందే, వెళ్ళు. వెళ్ళి ఆయన ఆ కబాబ్ తింటున్నాడో లేదో చూడు. ఎవరూ సంతోషించకపోతే, చెప్పుకొని నవ్వుకోకపోతే పరాచికమాడి ఏం ప్రయోజనం?''

అక్క నావైపు చూసింది. తన కళ్ళు విచారంగా ఉన్నాయి. తిరస్కారపు అవమానం కళ్ళ నిండా నిండి ఉంది. వేడుకుంటున్నట్టుగా ఉన్నాయా కళ్ళు. ఆ కళ్ళలో వివాహ ఊరేగింపు వెళ్ళిపోతుంటే లేచిన ధూళి కనబడింది నాకు. చౌతీ కా జోరాగా పనికి రాకుండా వెలిసిపోయిన మధుపర్కాల ఎర్రదనం ఆ కళ్ళలో కన బడింది. తలవంచుకుని మళ్ళీ గదిలోకి వెళ్ళాను. రాహత్ నిశ్శబ్దంగా భోంచేస్తున్నాడు. ఆయన నా వైపు కూడ చూడలేదు. ఆయన ఆ కబాబ్ తినడం చూశాను. తాను తింటున్నదేమిటో చూడలేని ఆయన తెలివితక్కువతనం చూసి నేను నవ్వి ఉండవలసింది. కాని ఎవరో నా గొంతు పిసుకుతున్నట్టుగా అనిపించింది. నేను మాట్లాడలేకపోయాను. అమ్మ నిశ్చాంతపోయింది. ఆమె నన్ను వెనక్కి పిలిచింది. పళ్ళు బిగబట్టి నన్ను తిట్టింది. ఆయనతో జట్టు కలపనందుకు కోప్పడింది. గడ్డితో తయారుచేసిన కబాబులు తినడంలో ఆ తెలివితక్కువ మనిషి ఇంకేమీ పట్టించుకోవడం లేదని నేనెట్లా చెప్పను?

"రాహత్ ఖాన్- మాంసపు ఉండలు బాగున్నాయా?'' అని అమ్మ అడగ

మన్న ప్రశ్న అడిగేశాను. జవాబు లేదు. అమ్మ నన్ను మళ్ళీ అడగమని ముందుకు తోసింది. "కబాబులు బాగున్నాయా చెప్పనేలేదు ?" అన్నాను.

"నువు భోజనం తెచ్చావు. నేను తినేశాను. ఏమో రుచిగానే ఉందను కుంటాను" అన్నాడాయన చిట్టచివరికి.

ఇంక అమ్మ ఆపుకోలేకపోయింది. "ఎంత అమాయకుడివయ్యా. ఆ కబాబులు గడ్డితో చేసినవని గుర్తించనే లేదా ?"

"గడ్డితో చేశారా ? నాకు గడ్డి, పొట్టు తినడం ఎంత అలవాటయిందంటే, నా కిప్పుడు తేడానే తెలియడంలేదు".

అమ్మ ముఖంలో నెత్తురు చుక్కలేదు. అక్క నావైపు చూడలేకపోయింది. మర్నాడు తగినంత సంపాదించడం కోసం రెట్టింపు కుట్టుపని చేసింది. ఆ రోజు సాయంత్రం మామూలుగా నేను భోజనం తీసుకుపోగానే ఆయన అడిగాడు.

"అచ్ఛా, ఇవాళేం తెచ్చావు నాకోసం? రంపపు పొట్టా ?"

"మీకు మా వంట నచ్చదా ?" అని నేను తీక్షణంగా అడిగాను.

"అదేం లేదు. కాని గడ్డితో చేసిన కబాబులు, పొట్టుతో చేసిన కూరగాయలు వడ్డించడం విచిత్రంగా ఉండదూ ?"

నాకు కోపం వచ్చింది. మేమేమో రొట్టెతిని, నీళ్ళుతాగి కాలం గడుపు తున్నాం. ఆయన ఏనుగు తినేంత తిండి తింటున్నాడు. మా అక్కకు జలుబుకూ, దగ్గుకూ కూడ మందులు కొనడంలేదు. గాని ఆయనకు ఖరీదయిన, రుచికరమైన వంటలు చేసి పెడుతున్నాం. నేను కోపంతో తిరిగి వచ్చాను.

అయితే మా పిన్ని చిట్కా పని చేసింది. రాహత్ ఇంటి దగ్గర చాలసేపు ఉండడం మొదలుపెట్టాడు. అక్క చాలసేపు వంటగదిలో ఉంటోంది. అమ్మకేమో చౌతీ కా జోరా కుట్టడంలో తీరిక ఉండడంలేదు. దుర్బుద్ధి నిండిన రాహత్ కళ్ళు, అన్నివేపుల నుంచి పదునైన బాణాల్లా నామీద దాడి చేసేవి. నేనాయనకు భోజనం తీసుకెళ్ళినప్పుడల్లా ఆయన నాతో ఏదో ఒకదాని మీద పరిహాసమాడేవాడు. వేళాకోళం చేసేవాడు. నాకు సిగ్గేసి అక్క దగ్గరికి వెళ్ళిపోయేదాన్ని. 'అక్కా ఆయనతో వ్యవహారం నీది. నువ్వే చూసుకో. నేనాయనతో నెగలలేను' అందామనిపించేది. కాని

ఆమెపైపు చూస్తే దువ్వకోని వెంటుకలు కనబడేవి. జుట్టుమీద బూడిద చల్లినట్టు అక్కడక్కడ తెల్లబడిన వెంటుకలు కనబడేవి. నేను నా ఆలోచనలను పక్కకు తోసేసేదాన్ని. ఈ మాయదారి జలుబుతోనే అక్క జుట్టు తెల్లబడిపోతోందని అను కునేదాన్ని. ఈలోగా రాహత్ నన్ను పిలిచాడు. నేను పట్టించుకోలేదు. అక్క నా వైపు గాయపడ్డ పక్షిలాగ చూసింది. నేను వెళ్ళక తప్పలేదు.

"నా మీద కోపమొచ్చిందా ?" అంటూ ఆయన నుంచి నీళ్ళగ్లాసు ఒకచేత్తో తీసుకున్నాడు. మరో చేత్తో నా చెయ్యి పట్టుకున్నాడు. నేను చెయ్యి విడిపించుకుని పరుగెత్తుకొచ్చాను.

"ఏమన్నాడాయన ?" అక్కగొంతు మృదువుగా ఉంది. సిగ్గూ, అభిమానాలు ఆ గొంతును అణచివేస్తున్నట్టుగా ఉంది. నేనామె వైపు చూశాను.

"వంట ఎవరు చేశారని అడిగాడు. చాల రుచిగా ఉంది. తిండి ఆపలేక పోయాను అని అన్నాడు. ఈ వంట వండిన చేతిని కూడ నేను తినేసేవాణ్ణి-అహం కాదు కాదు. ముద్దు పెట్టుకునే వాణ్ణి" అని గొణుగుతూ అక్క చేతులు గట్టిగా నా చేతుల్లో పట్టుకున్నాను. ఆ చేతులు గరుకుగా ఉన్నాయి. కొత్తిమీర వాసనా, పసుపు వాసనా వేస్తున్నాయి. నాకిం కన్నీళ్ళాగలేదు. పొద్దుటి నుంచి సాయంత్రందాకా పనిచేసే ఈ చేతులు, మసాలా నూరుతాయి, నీళ్ళు తోడుకొస్తాయి, ఉల్లిపాయలు కోస్తాయి, పక్కలు వేస్తాయి, బూట్లు తుడుస్తాయి. బానిసలలాగ సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం దాకా పనిచేస్తూనే ఉంటాయి. ఈ బానిసత్వం ఎప్పటికి అంతమవుతుందో భగవంతుడికే తెలియాలి. ఎప్పటికైనా ఎవరైనా ఈ చేతుల్ని మృదు వుగా తమ చేతుల్లోకి తీసుకుంటారా ? ముద్దు పెట్టుకుంటారా ? ఎప్పటికైనా ఈ చేతు లకు గోరింటాకు అలంకారాలు వస్తాయా ? ఎప్పటికైనా ఈ చేతుల్లో వివాహ సుగంధం వికసిస్తుందా ? అనిపించింది. పెద్దగా ఏడవాలనిపించింది.

"ఏమన్నాడాయన ?" అని అడిగింది అక్క. ఆమె చేతులు మొరటుగా వుంటే ఉండవచ్చుగాని, ఆమె గొంతు మధురంగా ఉంది. ఆ గొంతునే రాహత్ విన గలిగితే ఎంత బాగుండును. కాని రాహత్‌కు వినే చెవి లేదు. సువాసనను ఆఘ్రా ణించే ముక్కు లేదు. ఆయన కున్నదల్లా అడుగులేని గోతి లాంటి కడుపు మాత్రమే.

"మరీ అంత ఎక్కువ కష్టపడి పని చెయ్యొద్దనీ, మందులు తీసుకొమ్మనీ అక్కకు చెప్పమన్నాడాయన ?"

"అబద్ధాల కోరు !"

"అబద్ధాల కోరు ఆయనే, నేను కాదు !"

"పెద్దగా మాట్లాడకే తల్లీ." అంటూ అక్క నా నోటిమీద చెయ్యి పెట్టింది. "చూడు" అంటూ మళ్ళీ మొదలుపెట్టింది. "ఈ శాలువా ఆయన కియ్యి. నేనే అల్లానని మాత్రం ఆయనకు చెప్పకేం" అంది. అక్కా, ఈ శాలువా ఆయనకివ్వకు. నీ బలహీనమైన శరీరానికే శాలువా కావాలి అందామనుకున్నాను. కాని అనలేకపోయాను. "అక్కా, మరి నువ్వేం వేసుకుంటావు ?" అని అడిగాను.

"ఓహ్-నాకా, నాకేమీ వద్దు. నిజానికి వంటగదిలో ఎప్పుడూ వేడిగానే ఉంటుంది".

రాహత్ ఆ శాలువా చూడగానే, కనుబొమ్మలు ఎగరేసి, కొంటెగా "నువ్వల్లావా ఇది" అని అడిగాడు.

"నేను కాదు"

"ఐతే నేను వేసుకోను"

నాకు ఆ వెధవ కళ్ళు పీకేయాలనిపించింది. నాకేమనాలనిపించిందో తెలుసా ? కూలి లేని బానిసల్లాంటి చేతులు ఈ శాలువాను అల్లాయి. దీనిలో ప్రతి ముడీ ఒక దురదృష్టపు యువతి ఆకాంక్షలకూ, స్వప్నాలకూ ప్రతీక. డాయల నూపవలసిన చేతులు ఈ శాలువాను అల్లాయి. బుద్ధిహీనుడా, ఆ చేతుల్ని నీ చేతులతో లాలనగా ఎందుకు పట్టుకోవు ? ఆ చేతులు నిన్ను జీవన సముద్రంలో శిఖరాల్లోంచీ, లోయల్లోంచీ నడిపించుకుపోతాయి. అవి సితార్ వాయించవు. పియానో మెట్లమీద గంతులు వేయడం నేర్చుకోలేదవి. అందమైన పరిమళ పుష్పాలతో ఆడుతునే అవకాశమూ వాటికి దొరకలేదు. నీకు కడుపునిండా మెక్కబెట్టేందుకు ఆ చేతులు రోజంతా కుట్లు కుట్టి డబ్బులు సంపాదిస్తాయి. ఆ చేతులు సబ్బులో, బట్టల సోడాలో మునిగి తేలుతుంటాయి. అవి వంటగది వేడిమిలో మగ్గిపోతాయి. నీ మురికినంతా ఉతుకుతుంటాయి. అప్పుడిక నువ్వు తళతళలాడే తెల్లబట్టలు వేసుకుని, నీ ఆత్మ పరిశుభ్రమైందన్నట్టు

తిరుగుతావు. చేసే పనివల్ల ఈ చేతులనిండా గాట్లు పడ్డాయి. ఆ చేతుల మీద గాజులు గలగలలాడవు. ఇప్పటి వరకూ ఆ చేతులను ఎవరూ ప్రేమతో స్పృశించలేదు.

కాని నేను మౌనంగా ఉండిపోయాను. నన్ను నా స్నేహితులు చెడగొడుతున్నారని అమ్మ ఎప్పుడూ అంటూ ఉంటుంది. వాళ్ళు నా బుర్రలోకి కొత్త ఆలోచనలు ఎక్కిస్తున్నారట. వాళ్ళు ఆకలి గురించీ, చావు గురించీ, కరువు గురించీ, రవరవలాడుతున్న సజీవ హృదయం హఠాత్తుగా నిశ్చలమైపోవడం గురించీ కొత్త సంగతులు, వింత సంగతులు ఎన్నో చెపుతారు.

"ఈ శాలువా నువ్వే వేసుకోరాదూ ? చూడు నువ్వు తొడుక్కున్న బట్టలు ఎంత సన్నగా ఉన్నాయో!" అన్నాడాయన.

పిచ్చెక్కిన పిల్లిలాగ నేనాయన ముఖంమీద రక్కాను. జుట్టుపట్టి లాగాను. పరుగెత్తి నా పక్కమీద పడిపోయాను.

చపాతీలు చేయడం అయిపోగానే, చేతులు కడుక్కొని అక్క నా దగ్గిరికి వచ్చింది. నా పక్కన కూచుంది. చేతులు తుడుచుకుంటోంది.

ఎదురుచూపుతో గుండె దడదడ లాడుతుండగా "ఆయన ఏమన్నా అన్నాడా?" అని అడగకుండా ఉండలేకపోయింది.

"అక్కా-రాహత్ దుర్మార్గుడు". అక్కకు అంతా చెప్పేసెయ్యాలని నేను నిర్ణయించుకున్నాను. "ఔను, ఆయన చాల చిలిపి మనిషి" అంది అక్క ప్రేమ నిండిన గొంతుతో. ఆ మాటలో కాస్త సిగ్గు కూడ కలిసింది. "అక్కా-అక్కా వినక్కా. ఆయన మంచి మనిషి కాడు". నేను ద్వేషంతో రగిలిపోతున్నాను. "నేనివాళే అమ్మకు చెప్పేస్తాను".

ప్రార్థన చాప పరుచుకుంటూ అమ్మ "ఏం జరిగింది ?" అని అడిగింది.

"అమ్మ - నా గాజులు చూడు"

"ఆయన పగలగొట్టాడా ?" అమ్మకు సంతోషంగానే ఉన్నట్టుంది.

"ఊఁ"

"మంచి పని చేశాడు. నువ్వా ఆయనతో పరాచికాలాడుతున్నావు గదా. ఇప్పుడెందుకింత గోల చేస్తున్నావు ? ముట్టుకుంటే పగిలిపోయే గాజుబొమ్మవి

కాదు నువ్వు" అంది అమ్మ. మళ్ళీ బుజ్జగిస్తూ "ఐనా, ఆయన చౌతీకి వచ్చినప్పుడు నువు బదులు తీర్చుకుందువు గాని. అప్పుడు ఆయన జీవితాంతం గుర్తుంచుకునే పని చెయ్యి". అని పూర్తిచేసి, అమ్మ ప్రార్థన చేసుకోవడం మొదలుపెట్టింది.

మళ్ళీ అమ్మ, పిన్ని సమావేశమయ్యారు. విషయం కాస్త ముందుకు నడిచిందనీ, ఆశావహంగా ఉందనీ అనుకున్నారు. విశ్వాసంతో నవ్వుకున్నారు. తల లూపుతూ నా గురించి మాట్లాడుకున్నారు. "అబ్బా ఈ పిల్ల మరీ ఇంత తెలివి తక్కువగా ఉందేం. మేం మా బావలతో ఎన్నెన్ని పరాచికాలాడేవాళ్ళం." అప్పుడిక పిన్ని నేనేం చేయాలో చిట్కాలు చెప్పడం మొదలెట్టింది. తాను తన చిలిపితనం వల్లనే ఎట్లా ఇద్దరు బంధువులకు పెళ్ళిళ్ళు చేసిందో చెప్పింది. ఆ రెండు సంబంధాలూ ఇక కుదరవనుకున్నారట.

"ఒక పిల్లవాడు హకీము. చెట్ల వైద్యం చేసేవాడు. బాగా సిగ్గరి. మేం వేళాకోళం చేస్తే ముడుచుకుపోయేవాడు. ఒకరోజు సరాసరిగా వచ్చేసి ఆ అమ్మాయిని నాకిస్తారా అని అడిగేశాడు. మరొకాయన పైస్టాంప్ కార్యాలయంలో గుమస్తా. ఆయన మా బాబాయి వాళ్ళింటికి వచ్చినప్పుడల్లా ఆయనతో బోలెడు పరిహాసాలాడేవాళ్ళం. ఒక్కోసారి ఆయన పాన్‌లో ఎర్రటి మిరపకాయలు పెట్టేవాళ్ళం. ఆయన మిఠాయిల్లో ఉప్పు కూరేవాళ్ళం. అయితే ఇదంతా ఆయనకూ బాగానే ఉండేది. రోజూ వస్తుండేవాడు. వాతావరణం ఎట్లా ఉన్నా, వాన వచ్చినా, వరదొచ్చినా తప్పకుండా ఇంటికి వచ్చేవాడు. ఒకరోజు మా ఇంట్లో ఎవరినైనా తనకు కుదర్చమని తన పరిచయస్తులను అడిగేశాడు. ఎవరు కావాలి అని అడిగితే ఎవరైనా ఫరవాలేదన్నాడు. అబద్ధాలాడితే నా కళ్ళు పోతాయిగాని, ఆ ఇంట్లో అమ్మాయిలందరూ నిజంగా అందవికారంగా ఉండేవాళ్ళు పెద్దమ్మాయి రైతులాగ ఉండేది చిన్నదానికి మెల్లకన్ను. కాని వాళ్ళ నాన్న వాళ్ళిద్దరికి చెరి పదిహేను తులాల బంగారం ఇచ్చాడు. అబ్బాయిలకు పెద్ద దొర కొలువులో నౌకరీ ఇప్పించాడు".

"సర్లే, ఇవ్వడానికి బంగారం ఉంటే, మంచి ఉద్యోగం ఇప్పించే పరపతి ఉంటే అమ్మాయికి సంబంధం దొరకబట్టడం మహాత్కార్యమా ?" అని అమ్మ నిట్టూర్చింది.

"కారణం అది కాదునే. ఈ రోజుల్లో అబ్బాయిలు కాస్త పొగడ్తలు కోరుకుంటున్నారు. నువు వాళ్ళను తోస్తే చాలు. ఎటు తోసినా ఫరవాలేదు".

కాని రాహత్‌ను తోయలేకపోయాం. ఆయన కొండలాగ నిశ్చలంగా ఉండి పోయాడు. నేనాయనను తోయటానికి ప్రయత్నిస్తే, ఆ క్రమంలో నేనే నుగ్గునుగ్గు పోయేట్లున్నాను అనుకుంటూ అక్కవేపు చూశాను. అక్క వంట గది గుమ్మంలో కూచుని, చపాతీలకు పిండి కలుపుతోంది. భూమి పగిలిపోయి తనను, పెళ్ళికొడుకు దొరకని తన స్థితిని లోపలికి తీసుకుంటే, అక్కడికక్కడే, అప్పటికప్పుడే పెళ్ళి పోదునుగదా అన్నట్టుంది.

మా అక్కకు ఒక పురుషుడు కావాలా ? అక్కర్లేదు. కాని ఆమె ఆకలి గురించి భయపడుతోంది. ఆమె ఆకాంక్ష ఉద్వేగ సాఫల్యంకాదు, కనీస మనుగడ. ఆమెకు తిండి పెట్టేవాళ్ళు ఎవరో ఒకరు, బట్టలిచ్చేవాళ్ళు ఎవరో ఒకరు కావాలి. వితంతువైన తల్లిమీద ఆమె భారంగా ఉంది. తొలగిపోవాలి.

మా ఆశలూ, కలలూ తెలుసుకునేందుకు రాహత్‌కు ఎన్నో సూచనలిచ్చాం. ఎన్నోరకాల ప్రయత్నించాం. కాని అవి గుర్తించినట్టుగా ఆయన ఒక్కమాట అనలేదు. ఆయన తల్లిదండ్రులు కూడ ఏ కబురూ పెట్టలేదు. అమ్మ ఎదురుచూసీ ఎదురుచూసీ అలసిపోయింది. తన కడియం అమ్మేసి ఒక మతగురువుకు కట్నం చదివించింది. ఆయన అందరి సమస్యలను తీరుస్తాడని ప్రతీతి. ఆ రోజు మధ్యాహ్నమంతా వాకిట్లో చుట్టుపట్ల యువతుల పాటలు మార్మోగిపోయాయి. అక్కకు ఎంత సిగ్గేసిందంటే ఆమె సామాన్లగది వదిలి రానేలేదు. ఆమె నరాల్లోని చివరి నెత్తుటి బొట్లు కూడ అక్కడి దోమలపాలయ్యాయి. బలమూ, శక్తీ ఉడిగిపోయిన అమ్మ దీవాన్‌మీద కూచుని చౌకీకా జోరాకు తుది మెరుగులు దిద్దుతోంది. ఆమె ముఖంలో ఆశ వ్యక్తమవుతోంది. ఆమె బాధలన్నీ తీరిపోతాయనే ఆశ. తన కోరిక ఫలిస్తుందనే ఆశ. తన ప్రార్థనలు ఫలించబోయేముందు ఇవి ఇంక ఆఖరిక్షణాలని ఆమె అనుకుంటోంది. మళ్ళీ ఒకసారి ఆమె ముఖం మీది ముడతల లోలోతుల్లోంచి వెలుగులు చిమ్ముకొచ్చాయి. అక్క స్నేహితులు ఆమెను ఆటలు పట్టిస్తున్నారు. అక్క సంతోషంగా, ఉద్విగ్నంగా ఉండేట్టు చేయాలని వాళ్ళ కోరిక. ఆమె రక్తమూ-శరీరంలో మిగిలిన చివరి బొట్లయినా సరే- ఎర్రగానే ఉండింది. కొద్దిరోజులుగా ఆమెకు జ్వరం ఉంది. అప్పుడప్పుడు ముఖం ఓ క్షణంపాటు వెలుగుతోంది. మళ్ళీ చీకటి కమ్ముకుంటోంది. నన్ను పిలిచి, ఒక పళ్ళెం నా చేతికిచ్చింది.

"ఇది నైవేద్యపు పళ్ళెం"

ఆ మాటతో అక్క శ్వాస నా చెవులకు తాకింది. అది జ్వరంతో వేడిగా, మండిపోతోంది. పళ్ళెం నా చేతుల్లో పట్టుకుని, ఈ మిఠాయి, ఈ ప్రత్యేకమైన, పవిత్రమైన మిఠాయి [illegible] రాహత్ కడుపులోకి వెళ్ళిపోతుంది. ఆ కడుపు గత ఆరు నెలలుగా మా చెమటతో, నెత్తురుతో నిండిపోయింది. కాని ఈ మిఠాయితో మా కలలు నిజమవుతాయి. నాకు కూడ వివాహ మంగళధ్వనులు వినిపించడం మొదలయింది. వరుడు వస్తూంటే చూడటానికి మేడమీదికి పరుగెత్తుతున్నట్టే అనిపిస్తోంది. ఆయన ముఖంమీద పెద్ద పెద్ద బరువైన పూలదండలు కప్పేశాయి. ఆ పూలదండలు గుర్రం తోకదాకా వేలాడుతున్నాయి. మా అక్క నాలుగోనాటి ఎర్రటి మధుపర్కం-చౌతీకా జౌరా-తొడుక్కుని ఉంది. ఎర్ర గులాబీలు అలంకరించుకుని, సిగ్గుతో, వినయంతో, వయ్యారంగా నడుస్తోంది. ఆమె దుస్తులు ధగధగలాడుతున్నాయి. అమ్మ ముఖంలో సంతోషం తాండవిస్తోంది. ఆ ముఖం వెలిగిపోతోంది. అక్క కనురెప్పలు వినయంగా వాలి ఉన్నాయి. మెల్లగా ఆమె కనురెప్పలెత్తి నావైపు చూసింది. ఒక కన్నీటిచుక్క, కృతజ్ఞత నిండిన కన్నీటిచుక్క రాలి వెండి జరీ అంచులో కలిసిపోయింది. 'ఇదంతా నీ వల్లనే జరిగింది' అని అక్క ప్రేమగా అంటోంది.

నా ఈ పగటికలల్లోంచి అక్కగొంతు నన్ను మేల్కొల్పింది. "పోవే. ఇయ్యిపో". నా కన్నీళ్ళు తుడుచుకుంటూ నేను ఆయన గదివేపు వెళ్ళాను.

• •

"ఇదిగో ... ఈ మిఠాయి మీకోసం" దడదడలాడుతున్న గుండెను చిక్కబట్టుకుంటూ హమీదా మాట్లాడటానికి ప్రయత్నించింది. ఆమె కాళ్ళు బలహీనంగా ఉన్నాయి వణికిపోతున్నాయి. పాముపుట్ట మీద కాళ్ళు పెట్టినట్టుగా ఉంది. అప్పుడు కొండ కదిలింది. రాహత్ తన నోరు తెరిచాడు. ఆమె భయంతో ఒక అడుగు వెనక్కి వేసింది. దూరంగా షహనాయిలు వాటి వివాహమంగళ ధ్వనులు గొంతు నులిమేయబడ్డట్టు ఏడ్చాయి. ఆమె ఒక మిఠాయి ముక్క తీసి రాహత్ నోట్లో పెట్టబోయింది. ఒక్క కుదుపుతో ఆమె చెయ్యి మరింత లోతుకి, లోలోతులకి వెళ్ళిపోయింది. మురికిలోకి, చీకట్లోకి వెళ్ళిపోయింది. ఒక పెద్ద బండ ఆమెను కప్పేసింది. బైటికి రానున్న ఆమె కేకను అణచేసింది. పవిత్ర మిఠాయి ఉన్న పళ్ళెం లాంతరుపై

పడింది. లాంతరు నేలమీద పడిపోయింది. అది ఒకటి రెండుసార్లు భగభగమని ఆరిపోయింది వాకిట్లో అమ్మాయిలు అందరి బాధలు తీర్చే యోగి గౌరవార్థం పాటలు పాడుతున్నారు.

తనకు దొరికిన అతిథ్యానికి శాశ్వత కృతజ్ఞతలు తెలియచేసి రాహత్ మర్నాడు ఉదయం రైల్లో ఇంటికి వెళ్ళిపోయాడు అసలు పెళ్ళి తేదీ నిశ్చయమై పోయింది గనుక, ఇంట్లో రమ్మన్నారు గనుక హడావుడిగా వెళ్ళిపోక తప్పలేదు.

ఆ తర్వాత ఈ ఇంట్లో ఎవరూ కోడిగుడ్లు వేయించలేదు. పరాటాలు తయారు చేయలేదు. చాల కాలంగా అక్కను వేధిస్తున్న క్షయ, ఆమెను పట్టుకుని తన ఒడిలోకి తీసేసుకుంది.

అదే వరండాలో, అదే దివాన్ మీద, శుభ్రమైన గుడ్డ పరిచారు ఇరుగు పొరుగు అమ్మలక్కలు, అమ్మాయిలు విచారంగా కూచున్నారు. అమ్మ ముందర తెల్ల దూది మృత్యు పక్షుల లాగ పరచుకుని ఉంది. ఆమె ముఖం వణికింది. ఎన్నెన్ని కష్టాలతోనో అది వాలిపోయి ఉంది. ఆమె ఎడమ కన్ను అదిరింది. ఆమె చెంపల మీద ఎన్నో ప్రవాహాలు వరదకట్టాయి. లక్షలాది కత్తెర్లు ఆమె హృదయాన్ని లక్షలాది ముక్కలు చేస్తుండగా తెల్లగుడ్డను సాపుచేసి, పరిచి, నాలుగు మడతలు పెట్టింది. ఇదివరకు కుట్టిన దుస్తులేవీ తొడుక్కునే అవకాశం రాలేదు గాని, ఇది తప్పకుండా తొడగబడుతుంది.

హమీదా గతాన్ని వదిలించుకుంది. సెహదారిలో కూచున్న యువతులు మైనాల్లాగ కిచకిచ లాడుతున్నారు. ఆమె వాళ్ళ దగ్గరికి వెళ్ళింది. ఎర్రనేత గుడ్డకు తెల్ల అంచు కలిపి కుట్టారు ఎరుపు అమాయక ఎఘుపుల కాంతిమయ ఆశలకు ప్రతీక. తెలుపు ఎప్పటికీ ఫలించని ఆకాంక్షల, స్వప్నాల ప్రతీక.

అప్పుడిక ఒక్కసారిగా, అందరూ నిశ్శబ్దమైపోయారు. కుర్తా వాళ్ళమ్మ ఆఖరి కుట్టువేసి, దారం కొరికేసింది. రెండు పెద్ద అశ్రుబిందువులు ఆమె చెంపల మీది నుంచి జారాయి. ఆమె ముఖం మీద ముడతల్లోంచి కాంతి కిరణాలు వెలువడ్డాయి. కుర్తా దుస్తులు ఇవాళ సిద్ధమైనట్టుగా ఆమె చిరునవ్వు నవ్వింది. ఇక ఏ క్షణాన్నయినా షహనాయి పాట వినవస్తుందన్నట్టు నవ్వింది.

* *

సీరియల్ నవల :

# రాగో

సాధన

(గతసంచిక తరువాయి)

## 10

గాండో ముందు నడుస్తున్నాడు. ఆ వెనుక ఫకీర అతని వెనుక గిరిజ, కర్వలు నడుస్తున్నారు. ధీ కొండ నుండి మతి కొండ చాల దగ్గర. నడుమ బాండే నదే అడ్డం. ఆ ఒడ్డున మతి కొండ. ఈ ఒడ్డున ధీ కొండ. కాస్తా పైకిపోతే మధ్యప్రదేశ్-మహారాష్ట్రల సరిహద్దుగా వస్తుంది బాండే. ఆ పై నుండి తిరిగి మళ్ళీ మహారాష్ట్రలోనే పారుతుంది. పాము మెలికలు తిరిగే బాండే యం. పి. లో పుట్టి యం. పి. - మహారాష్ట్ర సరిహద్దులో ఇంద్రావతిలో కలుస్తుంది. ఈ బాండే నదికి అక్కడక్కడ 'జాలామి' (ఓడ నడిపేవారు)లు డొంగా (ఓడ)లు వేస్తూ ప్రయాణికులని దాటిస్తుంటారు. విపరీతంగా వర్షాలు వస్తే వారం - పదిరోజుల వరకు కూడ బాండేలో కాక్రే వుల్లో దాటడం కుదరదు. బాండే ఒడ్లు ట్టి పారుతుంటే డొంగ వేయడానికి జాలామి భయపడుతుంటాడు. వృత్తిరీత్యా అతన్ని జాలామి అంటారు. "తల్లి బాండే ఎన్ని జీవాలను సముద్రం పాలు చేసిందో". ఏ జాలామి కూడా తొలకరి వర్షాల తర్వాత పూజ చేసి కానీ ఓడ వేయడానికి సాహసించడు. తల్లి బాండేను శాంతపర్చాలి అంటారు. ఎంతో అవసరం అయితే తప్ప రాత్రి పూట పొంగిపొరలే నదిలో ఓడ వేయడానికి అసలే సాహసించరు. నదిలో కొట్టుక వచ్చే అడవి దుంగలు ఓడను ఢీ కొడితే అది పట్టీ ఇచ్చిందంటే ఓడలోని మనుషులు అడ్రసు లేకుండా పోతారనేదే జాలామి మామ భయం. పారే నీళ్ళపై నురుగులు వస్తున్నాయంటే నది పొంగుతున్నదన్నమాట. ఈ బాండేనది పైన ఏటపల్లికి 10 కి.మీ. దూరంలో చంద్రకండి. సీటిపారుదల ప్రాజెక్టు నిర్మాణానికి పనులు సాగుతున్నాయి. ఈ డామ్ మూలంగా చుట్టుపట్ల ఇరవై ఐదు - ముప్పై గ్రామాలు లేవాలి. అందుకే ఆదివాసీలు డామ్‌కు వ్యతిరేకంగా ఆందోళన చేస్తున్నారు. ఇంత నదిలోనూ ఎండాకాలం వస్తే పారకం మాయమై అక్కడక్కడ మడుగులుంటాయి,

"అక్కా ! వాండే ఎంత ఉందో" కర్ప మెల్లగా గిరిజను కదిలించాడు.

"ఏమో దాదా - నాకు ఈ నీళ్ళంటేనే మహా భయం. చిన్నప్పుడు ఈత నేర్చుకుందామని ఎంత ప్రయత్నించినా అమ్మ పడనివ్వలేదు" అని తన ఆతురత వెళ్ళబుచ్చుతూ "అయినా డోంగ ఉండవచ్చులే" అనుమానంగా అంది గిరిజ.

"ఏమో అక్కా - వేస్తుండవచ్చు. వాళ్ళ వృత్తే అదికదా. ఈ మధ్య కొడుకులు ఎదిగాక వ్యవసాయం చేస్తున్నారు కానీ ముందు ముసలోడు ఇరవై నాలుగు గంటలు ఇక్కడే. ఈ ఒడ్డుకే ఆయన పొలం. వలలు, చేపలు ఉన్నదేనాయె దంటకు" అంటూ కర్ప గడగడ చెప్పుకుపోతున్నాడు.

"జారాము ! ఏమ్ జారామి" అంటూ ఒడ్డుకు ముందుకు చేరిన గాండో వేసిన కేక కర్ప - గిరిజల సంభాషణను తుంచేసింది. దూరంగా పొలంపని చేసుకుంటున్న జారామి ఈ కేకతో పని ఆపి "వాయినస్" (వస్తున్నాను) అంటూ రాసాగాడు.

"లాల్ సలాం దాదా" — అంటూ జారామి పీడో కుడిచేయి ముందుకు జాపి "జావ తాగిరానుపోయినా దాదా" అంటూ చేయి కలిపి పలకరించాడు.

"డోంగలో ఎందరం పోవచ్చు దాదా ?" — భయంతోనే ఆ ప్రశ్న వేస్తుందని పీడో సులభంగానే గుర్తించాడు.

"అందరు రావచ్చు బాయి - డోంగ పెద్దదే-దోఖా లేదు" అన్నాడు పీడో.

" బా అందరం ఒకేసారి పోవచ్చు" అన్నాడు గాండో అలస్యం కాకూడదనే ఆతురతతో"

"మనం నలుగురం - మన సామాను అంతా ఒక మనిషి బరువు అంటే ఐదుగురం - జారామితో ఆరు. కష్టం గాండో దాదా" అంటూ గిరిజ బెదురుతో.

"అక్కా నీవు ముందురా. ఈ అన్నలందరు తర్వాత వస్తారు. నిన్ను, సామాన్ను ఓ ట్రిప్పు దాటిస్తా" అంటూ పీడో డోంగలో ఎక్కిపోయాడు.

"అమ్మో ? ఎవరి తుపాకులు వాళ్ళవెంటే ఉండాలి" అంటూ డిసిప్లిన్ గుర్తు చేశాడు గాండో.

" మీ యిష్టం దాదా మొన్న పోలీసోళ్ళను దాటిస్తే ముందు వాళ్ళ తుపాకులన్నీ వాళ్ళ సాయిబును దాటించి ఆ తర్వాత అందరిని తీసుకెళ్ళా" అంటూ గిరిజ డోంగలో కూచోగానే డోంగను ముందుకు నెట్టాడు పీడో.

"పోలీసు సాయబుకు వాడి తుపాకులే ముఖ్యం తప్ప ఒడ్డున మిగిలిన పోలీసులు ఏమైతే వాడికేం కావాలి. ఆ లంజకొడుకులంతే" అంటూ "ఫకీరా నువ్వు అక్కతో పో" అని గాండో అనగానే ఫకీర డోంగలోకి దూకాడు. ఆ ఊపుకి కాస్తా డోంగ అటిటు అయ్యేసరికి గిరిజ 'కయ్యి'మని కేకపెట్టింది.

జారామి పక పక నవ్వుతూ "నీకేం కాదు బాయి ! కదలకు" అంటూ తెడ్డు వేశాడు.

"దాదా ! నాకు ఈత రాదు. కాస్తా మెల్లగా" గిరిజ మొదటి మాట.

"ఏం గాదు అక్కా - డోంగ దొర్లినా నువు డోంగను విడవకు. మునగపు- అక్కా ! నీళ్ళపైన డోంగ ఎంత తేలి వుందో చూడు. మూరెడుంది. ఏం మునగ ద"ంటూ డోంగ సూత్రం చెప్పాడు ఫకీరా !

డోంగ అవతలిపైపు చేరింది. గిరిజ గబుక్కున లేచింది. "బాయి మెల్లగ - అట్ల లేస్తేనే దొర్లిపడతరు. జాగ్రత్త. ఈ ఒడ్డుకు లోతు ఎక్కువ" అంటూ గుర్తు చేశాడు పీడో - మరో ట్రిప్పుకై డోంగ తిరుగుముఖం పట్టింది.

పీడో మాటతో గిరిజ మనసులో "గోదావరి దుర్ఘటన" తళుక్కున మెదిలింది.

అది వర్షాకాలం. గోదావరి పొంగుతూంది. ఒడ్డు పొళం నీళ్ళు - ఓడ వేయడానికి జారామికే భయమవుతుంది. అయినా అర్జంటు అపాయింట్‌మెంట్, తప్పితే కష్టం అని తప్పనిసరంటూ ఓడ వేయించారు అన్నలు. వెంకన్న, మాధన్న జారామి-ముగ్గురూ తూలుతూ, ఊగుతూ సాగే డోంగలో "ఏంగాదు అన్నా" అంటే "ఏం గాదు దాదా" అంటూ ఒకరికొకరు ధైర్యమిచ్చుకుంటూ దరిజేరబోతున్నారు. అవలిపైపున మిణుకు మిణుకుమంటూ టార్చిలైటు వెలుగుతూ ఆరిపోతూ అన్నలు వచ్చారని సంకేతం యిస్తూవుంది. మరో 10 గజాల్లో ఒడ్డు చేరుతుంది ఓడ. అంతలోనే ఒక దుంగవచ్చి డోంగను గుద్దుకొని తలక్రిందులు చేసిపోయింది. జారామి ఈదుకుంటూ ఒడ్డు చేరాడు. అన్నల జాడ లేదు. జారామి కళ్ళల్లో నీళ్ళు, "వీపుకు కిట్లు - జబ్బలకు తుపాకి వుంటే మనిషి ఈదలేడు దాదా. ఒక్క క్షణమైతే ఒడ్డెక్కుదుం. గంగపొయితా (చీకటి పట్టింది). వూపులో వచ్చిన దుంగ ఒక్క దొబ్బు దొబ్బింది", అంటూ, జారామి గొల్లుమన్నాడు. జారామితో సహా అన్నలు అమరులకి జోహార్లు అర్పించారు.

"దాదా పరో గంటకి కమాండర్ అన్నలు వస్తారు. వారిని కూడ దాటి వ్వాలి" అంటూ దిగుతున్న గాండో, కర్పలను చూసి గిరిజ యీ లోకంలోకి వచ్చింది

అందరికన్నా ముందుగా ఓడ్డెక్కిన ఫకీరా దూరంగా కొడిశ చెట్టుకొమ్మమీద గొర్రెంక పిలుపు విన్నాడు. చూశాడు "ఏముందమ్మా? పామా? ఉడుమా!" అంటూ అటు కదిలాడు. అక్కడికి చేరిన కర్ప కూడా అనుసరించాడు. గిరిజకు ఏమి అర్థం గాకపోయేసరికి గాండో భుజాలెగురవేస్తూ చిటికె వేశాడు.

"పద ఫకీరా! ఉర్పల్ (ఉడుం) గావచ్చు. సాయంకాలం నుంచి మంచి భోజనం నక్కను తొక్క వచ్చినం" అంటూ తోవ తీశాడు గాండో. కర్ప, ఫకీరా, గిరిజలు అనుసరించారు.

చెట్టుమీద ఉన్న ఉడుం నాలుగు కాళ్ళతో కొమ్మను బలంగా పట్టుకుంది.

గాండో కొక్కెం తయారు చేసాడు. కర్ప, ఫకీరలు కర్రలు అందుకున్నారు. గిరిజకో కర్ర ఇచ్చి అలర్ట్‌గా ఉండమన్నారు.

గిరిజ యింకా సర్దుకుంటూ వుండగానే కొక్కెంలో ఇరికిన ఉడుం గిరిజ ముందే టప్‌మని పడింది.

"అక్కా! అక్కా! వేసేయ్-" ఫకీరా, కర్పల గాబరా.

గాబరలో గురి తప్పి, కర్ర విరిగి గిరిజ ముందుకు తూలిపడింది. పళ్ళు విరిగినంత పనైంది.

కర్ప, గాండో, ఫకీరాలు కిల్లుమన్నారు. ఉడుం కొక్కెంలో గిలగిలమంది.

"అక్కా! ఉరిలో చిక్కిన ఉడుం ఎటు పోతుందక్కా" అంటూ గాండో అనేసరికి తనను ఆట పట్టించినట్లు గిరిజకు అర్థమైంది.

ఆదివాసీ క్రామేడ్స్ మధ్య జీవితంలో గిరిజకు కాలం తెలియకుండానే పరుగు తీస్తూంది. వీళ్ళు ఏదీ విడువరు. ఊహకు అందని ఉపాయాలతో ఉచ్చుల్లో దేన్నైనా యిట్టె పట్టేస్తారు. తేనె, చేపలు, కప్పలు, పాములు ఏదైనా కంటబడితే హుర్తి గావలసిందే.

"అక్కా! మీది 'టాండో' పాడికదా" ఉడుం తినకూడదు. చమత్కరించాడు ఫకీరా.

"అపను-టాండో సాడికి ఉడుం నడువదు. అక్క కూర నాకే" అంటూ లొట్టలు వేయసాగాడు కర్ప.

"అక్కా- తెలివి ఉపయోగించు అక్కా! ఈసారి పల్టీకొట్టడం వాళ్ళ వంతు గావాలి" అంటూ ఉడుం కొద్దిగా చీరి అందులో దాని కాలు యిరికించి ఆ ముడిలో దాని మెడ తగిలించి ఉడుంను చేతబట్టుకుంటూ గిరిజకు ధైర్యం యిస్తున్నాడు గాండో.

గిరిజ ఈమధ్యనే ఇంటిపేరు (పాడి) చెప్పుకుంటుంది. టాండోవారు తాబేలు తినరని తెలిసి 'సర్లే! అదేం దొరికేదా?' అని టాండో పాడి ఖరారు చేసుకుంది. ఇపుడెలా? "ఏం వుపాయం అన్న" అంటూ గాండో వైపు చూసింది.

"అక్కా! మీ ఆయన పాడి 'మరావి' అనేసేయ్ చెల్లుతుంది" అంటూ క్లూ ఇచ్చాడు గాండో.

"నో! నో! ఉడుం కోసం మా ఆయన ఇంటిపేరు పెట్టుకోవడమా! చచ్చినా మీ సాంప్రదాయాలకి నేనొప్పుకోను" అంటూ మూతి బిగించింది గిరిజ.

"పెళ్ళయితే ఇంటిపేరు మారిపోతుంది కదక్కా" అంటాడు గాండో మళ్ళీ.

"కమ్యూనిస్టుల్లో కూడ ఆ పాడు రూలేనా" అంది గిరిజ మరింత బెట్టుగా.

"అక్క మళ్ళీ ఓడిపోయింది. కూర మాకే" అంటూ కేరింతలు కొడుతూ ఆ నలుగురు ఊరి చివరి ఇళ్ళు చేరుకున్నారు.

మడికొండ 10 ఇళ్ళకు మించని ఊరు. అవన్నీ గడ్డి గుడిసెలే. పేదరికం కొట్టొచ్చినట్టు కనపడుతుంది. కొన్ని గుడిసెల మీద గడ్డి సైతం మొలిచింది. నిరుడు కప్పని గుడిసెల్లోనుండి పగలు రేయి కానవస్తున్నవి. ఆ ఊళ్ళో నోరు, డబ్బు ఉండి పైరవీ చేసేవాళ్ళు లేకపోవడంతో తిరిగి తిరిగి చెప్పులరిగినయితప్ప సర్కారువారి కవేల (బెంగుళూరు పెంకలు) వారికి చేరలేదు. ఏ ఆఫీసుకు పోయినా "అంగట్ల అవ్వ అంటే ఎవనికి పుట్టినవే బిడ్డా" అన్నట్లైంది వారి పని. ఊరి నడుమ 'గోటుల్' కూడ ఆ ఇళ్ళకేం తీసిపోదు. తాతలనాటి డోళ్ళు, డప్పులు చూరుకు వేళ్ళాడుతున్నాయి. అక్కడ యువకులు పడుకునే మంచాలు కీళ్ళూడి లుకలుకలాడుతున్నాయి. వారం రోజులు ముసుర్లలో ఆ ఊరికి తగ్గట్టె తుప్పుపట్టుతున్న సోలార్ లైటు స్తంభం, హేండిల్ ఊడిపోయిన బోరింగు చారిత్రక శిథిలాల్లాగా మొండిగా నిలబడి వున్నాయి.

గోటుల్‌కు కుడివైపు ఉన్న చిన్న గుడిసెలో అడ్డంగా తడక పెట్టి రెండు గదులు చేశారు. అది పిల్లలకు పాఠాలు చెప్పేబడి అనుకోవడానికి ఎలాంటి ఆధారాలు లేవు. అందులో ఊరి గొడ్లు పొర్లుతున్నవి. ఆ బడి పంతులుకు కూచోను కుర్చీ ఇంకా మంజూరు కాలేదు. ఏకోపాధ్యాయ పాఠశాల అది. గుంజకు ఒరిగించిన నల్లబల్ల కింద పడ్డట్టుంది. ఓ పంది దానిపై పడుకుంటే కూనలు పాలు చీకుతున్నవి. గురూజి, ఎప్పుడో బుద్ధి పుట్టిన్నాడు తప్ప రాడు. ఎందుకయ్యా అంటే "ఇక్కడ నేను ఎవరికి చదువు చెప్పాలి. గొడ్లకు, పందులకా!" అంటాడు. 'పిల్లలను బడికి తోలాలి కదా దాదా' అంటే 'ఆడికి పోటీ ఊడికెట్లా రావాలి' అంటూ జానెడు లోతుకు తప్ప ఎన్నడు నిండుగా కనపడని బొత్త (పొట్ట) వైపు చూపిస్తారు జనాలు.

వర్షాకాలం ఊర్లో దారికి రెండు వైపులా గడ్డి పెరిగింది. ఇండ్లలోని చెత్తా చెదారం త్రోవలో పారేయడంతో అది మురిగి మరింత కంపు వస్తుంది. ఊరవతలి పశుల కొట్టాల్లోంచి పారిన రొచ్చుతో నిండిన ఆ దారిలో కాలు పెడితేనే ఒళ్ళు జివ జివ అంటుంది. అందులో కాసేపు నడిస్తే చాలు పాదాలు చెడిపోతాయి. కొట్టాల్లో మోకాళ్ళ బంటి పేరుకపోయిన రొచ్చులో ఎటు మెసలరాక పశువులన్నీ అలా నిలబడే వుంటాయి. ఉదయం బాగా పొద్దెక్కాక ఆ కొట్టాల్లోనుండి వాటికి విముక్తి. పొద్దుపోతే మళ్ళీ ఆ కొట్టాలే గతి. కరువు, దరిద్రము, ఆకలితో మందు మాకు లేకుండా రోగాలు నొప్పులతో సతమతమవుతున్న ఆ ఊరి ప్రజలకు తమ పశువులు ఇంతటి దుర్గంధంలో గతిలేక పొర్లుతున్నాయనేస్పృహ కూడ లేదేమోననిపిస్తుంది. ఆ బాధ ఉన్నా వాళ్ళు చేయగలిగింది లేదు.

"గిరిజక్కా ! ఇక్కడ ఆగుదామా"- అంటూ 'పుష్పి' గుమ్మంలో నిలబడుతూ అన్నాడు గాండో.

"మరో ఇల్లు లేదా కాస్తా వాకిలి అయినా ఉంటే అందరం కూచోవచ్చు"- గిరిజ.

"ఈ మడికొండలో మనకు తెల్వనిది ఎక్కడుంది. ఇదైతే ఉరావ్. వాళ్ళది అడవికి దగ్గరుంటుంది. మనకు సేఫ్టీ"

అక్కడ ఆగారు ఆ నలుగురు ఉడుముతో.

ఉరావ్ తెగ ఆచార వ్యవహారాల్లో మాడియాల కంటే మరీ వెనుకబడిన తెగ.

వారి స్త్రీలకు పచ్చబొట్లు మరీ జాస్తి. కొందరికి కుంటో, సెంటో భూమి ఉన్నా వారందరికీ ప్రధానంగా వ్యవసాయ కూలీలుగానే పొట్ట గడువడం. గత 15-20 ఏళ్ళ నుండి పీరు బీహార్, మధ్యప్రదేశ్ నుండి వలస రావడం జరుగుతున్నా ఈ మధ్య "అన్నల" రాకలో భూములు నరుక్కునే అవకాశాలు పెరిగాయని, వారి వలస కూడ పెరిగింది.

ఆ ఊరి ఆడవాళ్ళు అప్పుడే పొలం పనుల నుండి వచ్చినట్టున్నారు. అలసిన ముఖాలతో పొయ్యిలు రాజేస్తున్నారు. చిన్నపిల్లలు మరుగాళ్ళ*పై నడుస్తూ కాలికి బురద అంటకుండ ఆడుకుంటున్నారు. బురదలో పొలం దున్ని జంబుకొట్టి కాళ్ళు చెడిన అన్నలు ఎత్తయిన కర్ర పాకోళ్ళతో నడుస్తున్నారు. అక్కలకు అవీ లేవు. అన్నలను చూసిన పిల్లలందరు ఇంటిముందు జమయినారు. వారి కళ్ళు వారి స్నేహితులు ఊల్గె, టుగ్గెలకోసం వెతుకుతున్నాయి.

అన్నలొచ్చారని తెలిసి సంఘం వత్తె ఎదురు వచ్చాడు.

"లాల్‌సలాం" అంటూనే చేయి ఎత్తేడు వత్తె.

"లాల్‌సలాం - అంతా మంచిదేనా"— గాండో ప్రశ్న.

"అఁ! ఏం మంచి దాదా! ఒక్కటే ముసుర్లు - దీనితో ఊరంతా జ్వరాలే. బైళ్ళే. పని రోజులు" - అని ఆ ఊరి యోగక్షేమాలు సంక్షిప్తంగా అప్పచెప్పి "ఎందరు దాదా !" అని దళం సంఖ్య అడిగాడు.

"పదమూడు దాదా" కర్ప జవాబు.

"దాదా వత్తే మీరు కూర జమ చేయకండి మేం ఉడుం తెచ్చినం"- ఫకీర అనేశాడు.

"మంచి పని చేసింద్రు దాదా. కూరలకు మహా తక్లీఫుగ ఉంది". అంటూ నూకలు జమ చేయడానికి వెళ్ళబోతున్న వత్తెను మరో ప్రశ్న వేసింది గిరిజ.

"గురూజి ఉన్నాడా దాదా ?"

"లేడు"- అంటూనే వత్తే తన పని మీద కదిలాడు.

గోటుల్ ముందు చిన్న గంపతో కూచుని నూకలు వసూలు చేస్తున్నాడు వత్తె. వంతు ప్రకారం ప్రతివారు బియ్యం, పొడిగటుక తెచ్చి అందులో పోస్తు

* ఎత్తయిన కర్రలతో నడకకు వీలుగా చేసేది

న్నారు. ఉన్న వాళ్ళ దొప్పల్లో ఉప్పు, కారం, పసుపు తెస్తున్నారు. అన్నలు వచ్చి నారని తెలిసి ఆ పూటకు తాము గుకాలు పోసుకొని ఆ బియ్యం తెచ్చి గంపలో పోసినవారు కూడ లేకపోలేదు. పోగయిన బియ్యం వత్తె తెచ్చేసరికి గాండో పొయ్యి రాళ్ళు తయారుచేశాడు.

ఫకీరా, గిరిజల మధ్య 'ఉడుం ఎలా వండాలి' అన్న అంశం ప్రధానంగా చర్చ అయి కూచుంది. "తోలుతోనే రుచి" అంటాడు ఫకీరా - కాదు "ఉడుకదు. అరగదు" అంటుంది గిరిజ.

దూరంగా కూచొని వీరి చర్చ వింటున్న కర్ప పాట ఎత్తుకున్నాడు.

"కర్ప జాగ అస్కు మూర్తి పోలోయె". ("కోసే దగ్గర అక్కలు అసలే పనికిరారు") పాట చరణం విన్న గిరిజ గయ్యిన లేచింది.

"బాసు నాయనా - ఒద్దే పోలో అన్ చడ్‌కు (స్త్రీకి ఏదీ పనికి రాదు) వేటకు వెళ్ళి అర్వ తిప్పలు పడి మీతోపాటు జంతువును దొరక బుచ్చుకున్నాక పంపకాల దగ్గరకి వచ్చేసరికి మాత్రం ఆడదాన్ని అమడ దూరం ఉంచుతారు. మంచి మంచి ముక్కలన్నీ మీరు కొట్టేసి ఆడదానికి మాత్రం 'కార్జం' లాంటివి 'పోలో' అంటారు. కోడిగుడ్డు, ఆఫ్టరాల్ కోడిగుడ్డు కూడ మన గొట్టె జాతిలో ఆడదానికి నిషేధమే కదవయ్యా బాబు? అన్ని రకాలు తింపే ఒళ్ళు బలిసి మీ మగజాతికి వినకుండా పోతారనే యిన్ని కట్టడాలు చేశారన్నది మాకుతెలుసు. నాయనా కర్ప - ఇది గొట్టోళ్ళ కులం పార్టీకాదు. గోండోల్ల ఇంట్ల పుట్టింది కాదు. ఆడదానిపై మీ నిషేధాలు, రివాజులు రుద్దడానికి - ఇది విప్లవ పార్టీ - ఇది కమ్యూనిస్టు పార్టీ, ఇది కార్మికవర్గ పార్టీ - మేము మీతో ఎందులో తీసిపోము" అంటూ 'మరోసారి మా అక్కల జోలికి వస్తావా'! అన్నట్టు సవాలు చేసినంత పని చేసింది గిరిజ.

"వెరీగుడ్ కామ్రేడ్ - ఇంత పెద్ద ఉపన్యాసం దంచిన మీరు, టాండో పాడి అయినా సరే యివాళ ఆ ఉడుం కూర మీరే వండాలి అక్కా" అంటూ గాండో పురెక్కించాడు.

"గాండో దాదా! పెడుసు చెట్టు ఎక్కుస్తున్నవ్ - అయినా నీ కోరిక ప్రకారం నేనే వండుతాను" అంటూ గిరిజ టకీమని ఒప్పేసుకుంది. పొయ్యివద్ద నూనె, పోపు గింజల కోసం వెతకసాగింది. "అక్కా గంజు మాడిపోతుంది" అని అరుస్తున్న

గాండో అల్లరితో ఏం చేయాలో తోచడం లేదు. కాలుతున్న గంజులో నీళ్ళచుక్కలు చల్లి చుయ్ మనగానే మాంసం ముక్కలు వేసేసి ఉప్పు, కారం, పసుపు వేసి నీళ్ళతో గాండో గంజు నింపాడు. విస్తుపోవడం మినహా గిరిజ చేయగలిగిందేమీ లేదు. అడవిలో వంటని బయట పద్ధతిలో పోల్చుకుని ఓ నిట్టూర్పు విడిచి గిరిజ "అన్ని నీళ్ళలో గంజు నింపేశావ్ కనీసం గోంగూర వేసినా పులుపుంటుంది. లేకపోతే నీళ్ళల్లో వేలుపెట్టి నోట్లో పెట్టుకున్నట్టుంటుంది గాండో" అంటూ గిరిజ మొహం వేలేసింది.

"అక్కా ? ఇంకా 'నొవ్వ' పండుగ చేయలేదు అక్కా ! అందుకే గోంగూర ఇపుడు ముట్టకూడదు. ఆ పండుగ అయ్యిందంటే కనీసం నాల్గు మాసాలు మనకు పచ్చిగోంగూరే. అడపా దడపా ఆ తర్వాత ఎండిన గోంగూరే దిక్కుకదా అక్కా- అయినా మనకోసం మినహాయింపు అమలు చేస్తున్నారు కదా మన దాదాలు. వత్తేను పంపి చూద్దాం" అంటూ గాండో వత్తేను కేకేశాడు.

గిరిజ ఆలోచనలన్నీ రివాజు వైపు మళ్ళాయి. ఇవ్వాళ మనకోసం ప్రారంభించిన మినహాయింపు రేపు రివాజ్ అయిపోవచ్చు. అసలు ఈ కట్టుబాట్లు అన్నీ కరువులో నుండే పుట్టి ఉండాలి. ఏ అడ్డు, అదుపు లేకుంటే ఇల్లు గుల్లేకదా. నోరు కట్టుకొని, పొట్ట కట్టుకొని ఇంత కాపాయం (పొదుపు) చేస్తుంటేనే వీరి బతుకులు ఇట్లా ఉన్నాయ్ ఖాయా - పీయా - మజా ఉడామా (తిని, తాగి, మజా చేయడం) అన్నట్లు ఎప్పటి కప్పుడే తినేస్తే రేపటికి తిండి గ్యారంటీ లేని జీవితాల్లో కష్టమే కదా ! అయితే అసలు విషయం మరుగున పడిపోయి ప్రతీదీ దేవుడి పేరుతో చెలామణీ అవుతుంటే అవి అంధ విశ్వాసాలై కూచున్నాయి.

ఎంత మూఢ విశ్వాసాలైనా, ఎంత ప్రాచీన సాంప్రదాయాలైనా కాలక్రమంలో పొట్టతిప్పల ముందు తలవంచక తప్పదు. బతుకు పోరాటం పైచేయి అవుతున్న కొద్దీ ఈ ఆచారాలు, రివాజులు తొలగక తప్పదు. ఒకప్పుడు అధికారుల ముందు గజగజలాడిన ఈ ఆదివాసులే ఇవాళ అధికారులనే గజగజలాడించడం లేదా ! పోరాటం పెరిగే కొద్దీ మార్పు త్వరితం కాకతప్పదు. ఈ మార్పులను ఇంకా అధ్యయనం చేయాలి అనుకుంటూ తన ఆలోచనల్లో తాను మునిగిపోయింది గిరిజ.

## 11

సుదీర్ఘమైన ఆలోచనలలో కూరుకుపోయినట్టు ఫిలాసఫర్ ఫోజులోనున్న గిరిజ వాలకం చూసి అప్పుడే అక్కడికి చేరుకున్న రుషి "బాండీని డోంగలో దాటంగా జడుసుకోలేదు కదా" అనుకుంటూ అనుమానంగా గిరిజను పలకరించాడు.

"ఏం గిరిజక్కా! డోంగలో ఇబ్బంది కాలేదు కదా! ఇక్కడ ఇంకా నయం. 'సరికెడ' రేవులోనయితే కుండతోనే దాటాలి. అది మాకే భయమేస్తుంది."

"జడుపులేని మగధీరుడు ఫకీరావాడ తోడుండే డోంగలో దివ్యంగా దాటినం." అంటూ కిసుక్కున నవ్వింది గిరిజ.

చెల్లుమన్న గిరిజ సమాధానానికి ఒక్క క్షణం విస్తుపోయి వెంటనే తేరుకుంటూ రుషి మనవాళ్ళంతా ఏం చేస్తున్నరంటూ పొయ్యివైపు నడిచాడు. అన్నం గంజు ముందు సంఘం వత్తే, కూర గంజువద్ద గాండో కనపడేసరికి 'ఏదో స్పెషల్ గాబోలు' గాండో ఉన్నాడనుకుంటూ కర్ప, ఫకీరా గూర్చి ఎంక్వాయిరీ చేయగా ఒకరు సెంట్రీ పోయినట్టు మరొకరు గోటుల్ దగ్గర ఎగరడానికి పోయినట్టు తెల్సింది.

రుషి, గిరిజలు మాట్లాడుకుంటుండగానే సీదో - మీన్కోలు వచ్చి గిరిజ చుట్టూ చేరారు. వెనుక వస్తున్న జైని అప్పుడే వాకిట్లో అడుగుపెట్టింది.

"గిరిజక్కా! మేము పోలీసులను గెదిమినాం!" అంటూ సీదో ఒక్క మాటలో అనేసరికి గిరిజకేమీ అర్థం కాలేదు.

"ఎక్కడా! ఏమైంది?" అంటూ గిరిజ గాబరాతో ప్రశ్నించింది.

పొయ్యి దగ్గరున్న గాండో రయ్యిన ఉరికొచ్చి గాబరాగా "పోలీసు లెక్కడ" అంటూ వీరివైపు చూడసాగాడు.

'ఇక్కడ కాదులే' అన్నాడు తాపీగా రుషి.

ఈ సంభాషణ మధ్యలోనే జైని అక్కడికి చేరింది.

"ఏంలేదు. జైని సెంట్రీలో దాడి జరిగింది. పేన్‌కస దగ్గర మేం మాట్లాడుకుంటుంటే పెట్రోలింగ్ పార్టీ అటువైపు వచ్చి సెంట్రీ కంట్లో పడేసరికి ఫైరింగ్ అయ్యింది" అంటూ క్లుప్తంగా ముగించాడు రుషి.

"ఎట్లయ్యింది జైని ఫైరింగ్" అంటూ గిరిజ రుషి జవాబుతో సంతృప్తి పడక అడిగేసింది.

"ఫకీరన్న, కర్పన్నలు ఏరక్కా" అంటూ ఈ వార్త వెంటనే చేరవేయాలన్న ఆతృతతో అడిగింది సీదో.

"అక్కలు! అంత గాబరా ఎందుకు. కర్ప సెంట్రీలో ఉన్నాడు. ఫకీర్ గోటుల్ దగ్గర ఉన్నాడు - భోజనాలు అయినాక వివరంగా మాట్లాడుకుందాం. అంతా తాం, తాం చేయకండి" అంటూ రుషి జాగ్రత్తలు చెప్పాడు.

"గోటుల్ దగ్గరికి పోయి ఎగురుతం దాదా మేము" అంది మిన్కో.

"ఇంగో - కానీ ఈ మాట అక్కడ మీరు విడువద్దు. ఆ తర్వాత మీటింగ్‌లో చెప్పుతాం" అంటూ తన అంగీకారం తెలిపిన రుషి గిరిజ, గాండోల వైపు చూస్తూ "మన సెల్ మీటింగ్ వేసుకుందాం. వాళ్ళు ఎగరడానికి పోతారు" అన్నాడు.

ఎగరడం అంటే ఆదివాసీలకు (నృత్యం/ఏందుమండ్) ప్రాణం. అదే వారి ప్రధాన వినోదం. ప్రతి సందర్భంలోనూ ఎగురుతారు. సందర్భాన్ని బట్టి అందరూ అన్ని వయసులవారు ఎగురుతారు. ఎగరడం వాళ్ళ జీవితంలోనే భాగం. చలికాలంలో, రాత్రులు, పెద్ద పెద్ద నెగళ్ళ చుట్టూచేరి యువతీ యువకులు కలసి ఎగురుతారు. ఎగరడంలోనే వయసైనవారి మధ్య ప్రేమలు పుట్టుకొస్తాయి. జోడీలు కుదురుతాయి. పాట, ఆట జోరుగా సాగుతూ ఉండే మనసు కుదిరిన జోడీలు మధ్యలో మాయమవుతూనే మళ్ళీవచ్చి కలుస్తుంటాయి. జోడి దొరకనివారు జోడి కోసం వేటాడుతూనే ఉంటారు. అందరూ అన్నివేళలా ఆట పాటల్లో లీనమవుతూనే ఉంటారు. తెల్లవార్లూ ఎగురుతూనే ఉంటారు. ఎగరడానికి ఎక్కడెక్కడి నుండో పిలుస్తుంటారు. పెళ్ళిళ్ళకు వచ్చినవారు ఎగరడానికి రెండు, మూడు రాత్రులు కూడ ఉండి పోతారు. స్తోమత ఉన్నవాళ్ళు ఇలాంటి ఆటపాటలను పెద్ద ఎత్తున రోజుల తరబడి నిర్వహిస్తుంటారు. చనిపోయినవారి గొప్పలు పొగుడుతూ చావుదగ్గర కూడ ఎగురుతారు. పండుగల్లో సరేసరి. పెళ్ళి పాటలు, చావు పాటలు, పండుగ పాటలు దేనికవే రకరకాలు ఉంటాయి. దేని అడుగులు దానికే ఉంటాయి. దేవుని పూజలో, ఎగిరే వేళల్లో 'పేన్ కర్సడ్' పేరుగా ఉంటుంది. ఎగరడానికి మైళ్ళతరబడి ఉత్సాహంగా పోతారు. ఎగిరేవేళల్లో కల్లు సేవించడం సరదా! కాలిగజ్జెలు కట్టుకోవడం ఓ పిచ్చిగా ఉంటుంది. పాట - ఆట మినహా వారు అనుభవించే ఆనందం మరెందులో ఉంది? 'రేలా' అంటూ గొంతెత్తి పురుషులు, 'రిలో' అంటూ శ్రావ్యంగా

స్త్రీలు అడవి అడివంతా ప్రతిధ్వనించేట్లు తమ అనుభవాలన్నీ పాటల్లో పేరుస్తూ అభినయిస్తూ పాడుతుంటే ఆ ఆనందం మనసున్నవాడికే అర్థమవుతుంది. డోళ్ళు, డప్పులతో, నగారా, కుండుడు, పర్రై, చిటుకోరలు మొదలైన ఎన్నో వాయిద్యాలతో సంగీతమే లోకంగా మునిగి తేలుతుంటారు. అందుకే ఏ ఊరికి వెళ్ళినా ఎగరడం నడుస్తుందంటే దళం అంతా అందులో పాల్గొనడానికి ఉవ్విళ్ళూరుతుంటారు.

ఆదివాసీ వ్యవసాయంలోనూ, వారి సాంప్రదాయ జీవితంలోనూ ఎన్నో మార్పులు, అభివృద్ధి వస్తున్నట్టే, వారి ఆట పాటల్లోనూ, సంగీత ప్రపంచంలోనూ కూడ ఇప్పుడిప్పుడు మార్పు చోటు చేసుకుంటుంది. బతుకుతీరులో మార్పులతోపాటు సంగీత రీతుల్లో కూడ కొత్తదనం పుట్టుకొస్తుంది. డోళ్ళు వాయిస్తూ, పాడుతూ ఎగర డంలో తరతరాలనుంచి వస్తున్న నిదానమైన రేలా, రీలో రాగాల్లో ఒక ఊపు, వేగమూ వినవస్తున్నాయి. రోజు రోజు పెరుగుతున్న పోరాటం ఆ రాగతాళాల్లో వేగాన్ని మరింత ఎక్కువ చేస్తుంది. బద్ధలైపోయే సనాతన సాంప్రదాయాల స్థానంలో బలమైన అభివృద్ధికర పద్ధతులు పెంచి పోషించడంలాగే ఆదివాసీల ఆట పాటల్లో పురివిప్పే సంగీత నృత్యాల్ని అందిపుచ్చుకొని పదిలపరచుకోవటం కాలం చేయవల సిన పని. అలా ఇంటరెస్ట్‌గా ఎగిరేవారిని ప్రత్యేక కారణాలుంటే మినహా ఆపడు రుషి. అలా అందరు గోటుల్‌ముందు ఎగరడానికి పోయినాక గాండో, గిరిజనులలో నెగడు దగ్గరే సెల్ సమావేశం ప్రారంభమైంది.

దళంలో వారు ముగ్గురే పార్టీ సభ్యులు - కమాండరే సెల్ కార్యదర్శి. పార్టీ సభ్యత్వం ఇవ్వదగినవారి పేర్లు కొన్ని పరిశీలనలో ఉన్నాయి. కొన్నింటిలో పై కమిటీ అభిప్రాయం రావాల్సి ఉంది. వాటిలో జైని పేరుకూడ ఒకటి. వారందరూ ఇంచుమించు ఒకే కాలంలో వచ్చినవారే. కేవలం సీనియారిటీ మాత్రమేకాక ఆ యా వ్యక్తుల చైతన్యం, అభివృద్ధి, వర్గపోరాటంలో వారు నిలబడుతున్న తీరు, చొరవ, ధైర్య సాహసాలు, ప్రజలతో వారి సంబంధాలు మొదలయినవన్నీ పరిశీలించిన మీదనే పార్టీ సభ్యత్వం ఇస్తారు.

"ముఖ్యంగా మనం మాట్లాడాల్సిన విషయం" అంటూ కమాండర్ ఉపో ద్ఘాతం మొదలుపెట్టాడు. ముసురులో తడిసిన కట్టెలలో నెగడు మండకుండా ఒకటే పొగ వచ్చి కళ్ళు మండుతున్నాయి. మంట ఎగదోయడానికి రుషి పాట్లుచూసి గాండో పొయ్యిలో కాలుతున్న కొర్రాయి తెచ్చిపెట్టాడు.

"పది నిమిషాల సెగడుకే మనకింత అవస్థ అవుతుంటే వంటా వార్పులకి అక్కలు ఎంత అవస్థ పడుతున్నారో - మనకి పట్టదుకదా" అని గిరిజ ఇంకేదో చెప్పబోతుంటే "లాల్ సలాం దాదా" అంటూ లట్టి వచ్చాడు.

అతడి పలకరింపు వాలకాన్ని బట్టి లట్టి ఏదో ముఖ్యమైన సంగతి చెప్ప కోవడానికి ఎవరూ లేకుండా చూసి అప్పుడు వచ్చాడన్నది అందరికీ అర్థమవుతూనే ఉంది.

"లట్టి సంఘ (బావ) గోటుల్ దగ్గర మనవాళ్ళు అందరు ఉన్నారు. అక్కడికి పద. మేం కూడ ఇపుడే వస్తా"మంటూ లట్టిని పంపే ప్రయత్నం చేశాడు గాందో

"అలాగే దాద!" అన్నాడు గాని లట్టి కదలలేదు.

"దాదా - గడిసేపాగు - మా ముచ్చట ఉంది. పది నిముషాల్లో మనం మాట్లాడుకుందాం" అన్న కమాండర్ మాటతో లట్టి తృప్తిగా అక్కడే కూచుండి పోయాడు. "మనం తెలుగులో మాట్లాడుకుందాం" అంటూ మళ్ళీ మొదలెట్టాడు రుషి.

"కామ్రేడ్స్! మేము పేనుకస వద్ద మాట్లాడుకుంటుండగా పోలీసుల దాడి జరిగింది. కారణం యింకా ఆలోచించాలి. ఏమైనా ఆ టైంలో జైని సెంట్రీలో ఉంది. అదే టైంలో తేనెకోసం వెళ్ళిన డుంగకూడ అక్కడే ఉన్నాడు. అకస్మాత్తుగా పోలీసులను చూడగానే ఏ మాత్రం తత్తరపడకుండా వెంటనే జైని కాల్పులు ప్రారం భించడం, డుంగకూడ తోడుండడం మరింత నయమైంది. ఫైరింగ్ విన్న వెంటనే నేను మన దళ సభ్యులను తీసుకొని అడ్వాన్స్ అయ్యాను. దోలు దాద వాళ్ళకు బాంబులిచ్చాను. జరిగిన ఫైరింగ్ ఐదు నిముషాలేగానీ అందరూ ధైర్యంగా కాల్చారు. పోలీసులు నిలబడలేక పారిపోయారు. అన్నిట్లోకీ కాషన్ ఇవ్వగానే దోలు దాద విసిరిన గ్రెనేడు పేలడంతో పోలీసులు ఖంగుతిని కాలికి బుద్ధిచెప్పారు.

మేమిక డిస్పర్స్ అవుతుండగా అక్కడికి చేరిన ఊరివాళ్ళు పోలీసుల గూర్చి మరింత వివరం చెప్పారు. దరోగా - మరో ఇద్దరు ఊళ్ళో ఉంటే నల్గురు ఇటు వచ్చారట. బహుశ ఊళ్ళో ఎవరైనా మనరాకగూర్చి ఉప్పందించారా? లేక మామూ లుగా కల్లుబట్టీల కోసం తొగులు తిరగటానికి వచ్చారా తెలియదు. ఏమైనా సెంట్రీలో నున్న జైని అలర్ట్ చేసినపుడు అందరం అక్కడికి చేరి ఫైరింగ్ చేసినందునే ఏ

ప్రమాదం లేకుండా బయటపడినాం. ఇందులో గాయా ఎవరికి రాలేదు. ఊరి వాళ్ళు ధైర్యంగానే ఉన్నారు. ఇకపోతే అసలు విషయం ఏందంటే -

వచ్చే సోమవారం ఈ పట్టి పెద్దల మీటింగ్ ఉందట. రోజురోజుకు ఆడపిల్లలు పెద్దల మాట వినడంలేదని, రివాజులు తప్పుతున్నారని, కాబట్టి పట్టిలో రివాజులు గట్టిగ అమలుచేయాలనీ సమావేశం అవుతున్నారు. ఊళ్ళో మన సంఘాల్లో యువ కుల పాత్ర బలపడకుండా అడ్డుకోవడానికి పెత్తందార్లు వేస్తున్న ఎత్తుగడల్లో ఇది కూడ ఒక భాగమే. దానికి కౌంటర్‌గా మనం ప్రజలకు అసలు విషయం అర్థం చేయించాలి.

మనం మహిళా సంఘాలు పెట్టడానికి చేయాలనుకుంటున్న ప్రచారానికి నిర్దిష్టంగా ఈ సమస్యనే జోడించవచ్చు.

అలాగే పోలీసులు మన పార్టీ పేరుతో "భగవాన్ జూట్ హై" అనే కరపత్రం వేసి మరో కరపత్రం మాజీ హోం మంత్రి బాబురావు మడావి పేరుతో అచ్చు వేయించారు. ఇలాంటి కరపత్రాలు ఇప్పటికే కొన్ని ఊళ్ళల్లో మన దృష్టికివచ్చాయి. ఆదివాసీలు మొక్కే విగ్రహాలను విరగ్గొట్టాలనీ, గోటుల్‌లను మన సంఘం ఆఫీసులుగా మార్చాలనీ పూజా పునస్కారాల పేరుతో వృథాచేసే డబ్బంతా పార్టీకి ఇవ్వాలనీ, నక్సలైట్లు ఊరూరా ఆదివాసీలను బెదిరిస్తున్నారంటూ ఇలా అడ్డమైన రాతలతో వారిని రెచ్చగొడుతూ "ఆదివాసీ యువక్ క్రాంతి సంఘటన్" అనే సంస్థను సృష్టించి దానిపేరుతో ఆ కరపత్రంలో మరీ నీచంగా రాశారు. 'నక్సలైట్లను గెదమండి, తరమండి అన్నారు. గొట్టె స్త్రీలను తాత్కాలికంగా వాడుకుంటూ సొంతపెళ్ళాలను నగరాల్లోనిఫైవ్ స్టార్ హోటళ్ళలో కులకపెడుతున్నారని రాశారు. విప్లవం అని కేకలేస్తూ సంచులకొలది డబ్బు బంగారం సంపాదిస్తూ ప్రజలను తప్పుతోవ పట్టిస్తూ పబ్బం గడుపుకుంటున్నామని నానా కూతలు కూశారు. వీటన్నిటిని ప్రజల్లో మనం స్పష్టంగా చెప్పాలి.

మన పాత అక్కలైన రేఖ, మెంతక్క, ఇర్పిలతోపాటు ఈసారి పిల్లి, నవురిలుకూడ వచ్చారు. పిల్లి తన పసికందును వెంటపెట్టుకొని వచ్చింది. ఈ రెండు రోజులు లెబుడుదాదా చేయి కాల్చుకోక తప్పదు. నవురిని ఇంట్లో నుండి వెళ్ళనీయకుండా కట్టుదిట్టం చేశారట తల్లితండ్రులు. ఎట్టకేలకు సాహసంచేసి వచ్చింది. అందరు ఉత్సాహంగానే ఉన్నారు. రివాజుల గురించి, పోలీసుల ప్రచారం

గురించి బాగా అర్థం చేయించాలి. కనుక క్యాంపెయిన్‌లో కనీసం మొదటి వారం రోజులైన మన దళం అక్కడకూడ ఉంటే బాగుంటుందనీ ధీకొండ దాదలు పట్టు బడుతున్నారు. ఇదీ విషయం. ఇక మీ అభిప్రాయాలు చెప్పండి" అంటూ సమస్యను వారి ముందు ఉంచాడు.

కమాండర్ తెలుగులో చెప్పుకున్నంత సేపు గాండోకు దళంలో తన తొలి దీనాలు గుర్తుకు రాసాగాయి. మొదట్లో తెలుగు ఏ మాత్రం వచ్చేది కాదు. అనాడు దళంలో తెలుగు వారే అధికం. వారు తెలుగులో మాట్లాడుకుంటుంటే తాను పిచ్చి కోతిలా ఎలా చూసేవాడో ఇవాళ పరిస్థితితో పోల్చి చూసుకోసాగాడు. ఇవాళ తెలుగు పత్రికలు కూడ చదవగలుగుతున్నాడు. తెలుగు పాటలు పాడుతున్నాడు. మాడియా అక్షరాలంటూ వేరే లేకపోయినా, భాషలో పాటలు కట్టి తెలుగులో రాసు కొని పాడుతూ ఊళ్ళో తమ్ముళ్ళకు నేర్పుతుంటే, తాను మాడియాలో రాసిన కథ-తెలుగు పత్రికలో అచ్చు పడిందంటే - గాండోకు పట్టరాని సంతోషంగా, గొప్ప గర్వంగా ఉంది. తాను చదువు నేర్చుకోవటమే గొప్ప అనుకుంటే, రుషి, గిరిజ లాంటి వాళ్ళు మాడియా నేర్చుకొని, ఊళ్ళో అన్నీ మాడియాలోనే మాట్లాడటం, మాడియాలోనే రాజకీయాలు చెప్పటం ఇంకా గొప్పగా కనిపిస్తుంది గాండోకి. లట్టి లాంటి వాళ్ళు మన చర్చలు వినకూడదని తప్పిస్తే, పార్టీ మీటింగులు, దళం మీటింగులు కూడ గోండిభాషలోనే జరుగుతూ ఉండడం గాండోకు కొంటెక్కినట్టుం టుంది. తిండి, తిప్పలు, ఎగరడం, ఆట-పాట లన్నింటిలో ఇంటి మనుషుల్లా కలసి పోవడమే గాక పాడేలు దేవర్లతో సహా చుట్టరికాలు కలుపుకునే పార్టీ ఆదివాసుల్లో ఒకటై పోవడం సరేసరి. మాడియాల్లోంచే తన లాంటి వాళ్ళు ఎంతోమంది సంఘ నాయకులు, పార్టీ నాయకులుగా కూడ పుట్టుక రావడం, తాను దళానికి డిప్యూటీ కమాండర్ గావడం ఎప్పుడు అద్భుతం అనిపిస్తూనే ఉంటుంది. ఆదివాసీ విముక్తి ప్రాంతాలు, ప్రజాసైన్యం అంటూ చర్చల్లో అప్పుడప్పుడు దొర్లే మాటలు గుర్తొచ్చి నపుడల్లా గాండో కలల్లో తేలిపోతుంటాడు.

"ఏం కామ్రేడ్- ఏం చేద్దాం చెప్పండి క్యాంపెయిన్" అనే హెచ్చరికతో తేరుకొని గాండో ఏదో చెప్పబోయేసరికి

"మనం కూడ వారి వెంటపోతే వారి చొరవ దెబ్బతిని ప్రతిదానికి మనపైనే ఆధారపడుతుంటారనేది నేను ఆలోచిస్తున్నాను" అంది గిరిజ తన అభిప్రాయంగా,

"మనం ఉన్నంత మాత్రాన్నే వారి చొరవ దెబ్బతినదు. వారి చొరవ, ధైర్యం, పెంచే పద్ధతులు మనం ప్రోత్సహించాలి. వారిని ట్రేనప్ చేసుకోవాలి. మనం ఉంటే ఊళ్ళల్లోని రియాక్షనరీలు కూడ కంట్రోలుగా ఉంటారు. అసలే రివాజులపై క్యాంపెయిన్. మనం ఉండడమే మంచిదని నా అభిప్రాయం" అన్నాడు రుషి.

"జానక్కా ! పోవడమే మంచిది" - అన్నాడు గాండో.

"ఇంగో" అంటూ తలూపింది గిరిజ.

క్యాంపెయిన్ ఎన్ని రోజులు - ఏయే గ్రామాలు అనే వివరాలు కూడ మాట్లాడుకున్నారు. క్యాంపెయిన్‌కు జైనిని కమాండర్ చేయాలన్న గిరిజ ప్రపోజల్ కాదంటూ గాండో, రుషిలు గిరిజనే కమాండర్‌గా ఉండాలన్నారు.

ఊరి అక్కలకు కాలకృత్యాల నుండి క్యాంపెయిన్ కర్తవ్యాల వరకు క్రమశిక్షణను ప్రవర్తనను అన్నింటిని దగ్గరుండి నేర్పాలని తీర్మానించుకున్నారు. సబ్బులు, నూనెలు దళం వారు తమ కోటానే వాడుకోవాలనీ ఊరి అక్కల కోసం అదనంగా ఖర్చుపెట్టాలనీ కూడ వారు నిర్ణయం చేశారు.

దూరంగా కూచుని వీరి చర్యనే తదేకంగా చూస్తూ నిశితంగా పరిశీలిస్తున్నాడు - లట్టి. ఈ రకంగా ఆడవాళ్ళు మగవాళ్ళు కలసి కూచొని ముచ్చట చేయగా తానెవరినీ చూడలేదు. పండుగనాడైనా, పెళ్ళినాడైనా కూడ పని ఉంటే శేడోలకు పురమాయించటమే తప్ప, ఇలా ఔను-కాదు అని మాట్లాడుకోవడం ఎరగని లట్టి విస్తుపోతున్నాడు.

జంగలోన్ని (గార్డుని) గజగజలాడించే రేంజర్‌ని, పోలీసోన్ని హడలెత్తించే దరీగని, బాబులను గంటల తరబడి నిలబెట్టించి మాట్లాడే మిల్లు సాయబులను మాత్రమే ఎరిగి ఉన్న లట్టికి కమాండర్ ముందు గిరిజ-గాండో కూడ నవ్వుతూ కూచొని మాట్లాడడం వింతగానూ, ముచ్చటగానూ ఉంది. ఆ ధ్యాసలో ఆలోచిస్తున్న లట్టి తను వచ్చిన పని మరచిపోయి కళ్ళప్పగించి చూస్తూ కూచున్నాడు.

"దాదా - లట్టి దాదా" అంటూ పిలిచే వరకు ఈ లోకంలోకి రాలేదు లట్టి.

"దాదా - మన అన్నలు - అక్కలు గోటుల్ దగ్గర ఉన్నారు. వంట అయ్యింది. పిలుపు" అంటూ కమాండర్ పురమాయించాడు.

లట్టిని పంపించి గాండో భుజంపై చేయి వేసి పక్కకు తీసుకెళ్ళాడు.

క్యాంపెయిన్ అక్కలతో సహా మొత్తం 18 మందికి కూర సర్దాలని వడ్డన చూసుకోడానికి వెళ్ళిపోయింది గిరిజ.

"గాండో దాదా! రేపు మన అక్కలు క్యాంపెయిన్‌కి పోతారు. మిగిలిన ఎనిమిది మందిని డివిజినల్ కమిటీ అపాయింట్‌మెంటుకు పోవాలి. వారం తర్వాత కలుసుకోడానికి అపాయింట్‌మెంట్ పెట్టుకో. ఎవరమైనా అన్ని జాగ్రత్తలతో ఉండాలి. పోలీసు మూవింగ్ పెరిగింది"- అంటూ బాధ్యతలు అప్పగించాడు.

రుషి చెప్పే మాటలన్నిటికి గాండో "ఇంగో-హే" అంటూ జవాబు ఇస్తున్నాడు.

గిరిజ, తినే స్థలం అంతా ఒక్కసారి చీపురుతో ఊడ్చి ఆకులు కడిగింది. నెగడు మంట కష్టమని కిట్టులోనుండి క్యాండిల్ తీసి తిండికి వచ్చే వారికై ఎదురు చూడసాగింది.

దళ సభ్యులను పిలవడానికి వెళ్ళిన లట్టి గబగబా వస్తూనే "ఊళ్లె దాదాకు దేవుడొచ్చింది. దేవుని జండా పట్టుకొని ఎగురుతున్నాడు" అని చెప్పేసి చూడాలన్న గాబరాతో వచ్చినంత వేగంగా వెళ్ళిపోయాడు.

గాండో ఉత్సాహంతో చూడ్డానికి పరుగుదీశాడు. గతంలో పార్టీలోనికి రాక ముందే ఇంటివద్ద "పోల్వ" (పండుగ) సందర్భాలలో ఊళ్లె దేవుడు పూనేవాడని కమాండర్‌కు తెలుసు. కానీ ప్రత్యక్షంగా చూడలేదు. ఇపుడు ఆ అవకాశం వదల కూడదని గిరిజను వెంటపెట్టుకొని గోటుల్ వైపు బయలుదేరాడు రుషి.

"ఈ దేవుళ్ళు రావడం చాలా గమ్మత్తుగా ఉంటుంది కదూ! దేవర పూజల్లో ఎగిరే వేళల్లో డోళ్ళు, డప్పులు రణగొణ ధ్వనిలో, ధూపదీపాల వేడిలో ఒక హిప్నటిక్ వాతావరణం తయారై ఆ భక్తి పిచ్చిలో ఉన్నవాళ్ళకి ఆ క్షణంలో వారు ఏం చేస్తారో వారికే తెలియదు.

ఓ సారి మా అమ్మ కూడ అలా చేసింది. అయితే పొట్ట కూటికై దేవుడు దూలడం వేరు అనుకో! అంటూ ముచ్చట చెప్పుకుంటూ గోటుల్ చేరుకున్నారు రుషి-గిరిజలు.

అప్పటికే గ్రామస్తులు తంతు అంతా పూర్తి చేయడంతో అప్పుడే ఊర్గె తెలి వికి వస్తున్నాడు.

"క్యా హై కామ్రేడ్ ఊర్గె - తెలివి వచ్చినట్టుందే. నిన్ను చూద్దామనే మేము వస్తున్నాం. మళ్ళీ ట్రై చేయి కామ్రేడ్" అంటూ జోక్ చేశాడు రుషి.

"నువ్వేందే రాదు దాదా" అంది మిన్కొ.

"దాదా అంటే దేవునికి భయం" అంటూ మరోమాట కలిపింది సీదో.

"అసలు భయం దాదా అంటే గాదు. నక్సల్‌వాది అంటేనే ఈ దేవర్లకి అందరికి భయం" అంది జైని.

''వెరీ గుడ్ జైని. ఇది పక్కా'' అంది గిరిజ.

''అన్ని తీర్మానాలు మీరే చేసేస్తున్నారే'' అంటూ నవ్వుతూ అందరినీ వెంట పెట్టుకొని భోజనాలకై వచ్చాడు రుషి.

గిరిజ తొందర చేసినంత వేగంగా తిండ్లు ముగించుకున్నారు. గిరిజకు జైని వడ్డనలో తోడయింది. భోజనాలు ముగించుకున్న వారు ఎవరి పనుల్లోకి వారు పోయారు. రుషి లట్టితో కూచున్నాడు. కుల్లె, మూర సెంట్రీలు పోయారు. దుంగ ఊరివాళ్ళతో చర్చల్లోకి దిగాడు. టుగ్గె పిల్లల్లో కలిశాడు. అక్కలు అక్కల్లో కలిశారు. లట్టి తన అవస్థ చెప్పసాగాడు. రుషి శ్రద్ధగా వింటున్నాడు. తనకున్న రెండెకరాలకు జతగా అనుకొని ఉన్న అడవిని అన్నల నడిగే నరుక్కున్నాడు. జంగలోల్లు పి. ఓ. ఆర్. (ప్రైమరీ అఫెన్సివ్ రిపోర్ట్) పత్రాలపై సంతకం పెట్టమంటే పెట్టాల్సిన అవసరం లేదన్న అన్నల మాట అక్షరాలా పాటించాడు - కానీ ఓనాడు పోలీసులతో వచ్చిన జంగలోల్లు ఒంటరిగా చూసి బలవంతంగా లట్టిచే సంతకం తీసుకున్నారు. అది మొదలు ఇవ్వాల్టి వరకు నాలుగేండ్లు నుండి కోర్టుకు నడుస్తున్నాడు. చంద్రపూర్ కోర్టుకు పోయి రావడానికి కనీసం యాభై రూపాయలు లేనిది కాని పని. భూమి కోసం జైలుకు వెళ్ళి విడుదలకై చేసిన అప్పు రెండువేలు తీరనే లేదు. ఎన్నాళ్ళు ఈ కేసులకు తిరగడమో అర్థం కాని లట్టి రుషి ముందు తన సమస్యను ఉంచాడు.

కొట్టి కొట్టి అరిగిపోయిన గిరకలో ఇరుక్కున్న మోట దండెడలాగ మొల తాడుకు బిగించిన గోచి పేగు తప్ప మరో గుడ్డ ముక్కే లేదు లట్టి ఒంటి మీద. ఇంట్లో ఓ పూట వుంటే మరో పూటలేని బ్రతుకు. ఇప్పపూలు, వెదురు కక్కు,

అంబలితోనే ఉదయం నడుస్తుంది. సాయంకాలం నాలుగు మెతుకులు. ఎండాకాలం గడ్డలు - వెడ్డలు ఏరుకొని ఇల్లు గడపడం మహా కష్టంగా ఉంటుంది. సహజమైన చావుల కన్నా ఆకలి చావులే ఎక్కువ ఈ అడవిలో. అలాంటి లట్టి జీవితంలో కోర్టు కేసులు అంటే ఎట్లుంటుందో ఊహించుకోవచ్చు. ఇలాంటి అభాగ్యులు కేసులు అంటూ, కోర్టులకు పోవడం జరగని పని అని రుషికి తెలుసు. రుషి అదేమాట లట్టికి నచ్చచెప్ప సాగాడు.

"లట్టి దాదా ! కేసుకు పోకు - ఏమవుతుందో చూద్దాం. ధీ కొండ సంఘం వాళ్ళకు మేం చెప్పుతాం. రైతులపై బనాయించిన కేసులన్నీ ఎత్తివేయాలని మనం మోర్చా (ప్రదర్శన) జరుపుదాం. రైతాంగాన్ని కూడగట్టాలి. బలవంతాన పోలీసులు తీసుకెళ్ళడానికి ప్రయత్నిస్తే అన్ని గ్రామాల్లోని ఆడ - మగ - పిల్లలు ఎదురు తిరగడం మినహా మార్గం లేదు. జంగలోళ్ళ భూముల్లో పిచ్చితుమ్మలు నాటే ప్రయత్నం చేస్తే వారిని గెదమాలి. అలాంటి కూలి పనులకు ఎవరు పోకుండా చూడాలి. ఒక్క విషయం దాదా ! మన ఊళ్ళల్లోని యువకులు పోలీసులకు దొరకకుండా చూడాలి. పోలీసులు ఏ యువకుడు దొరికినా నక్సలైటు అంటారు. చంపేస్తారు. పైగా ఎదురు కాల్పులు అంటారు. ముగ్గిలాయి (ఆదిలాబాద్)లో అమాయక యువకులను ఇరవై ఐదు మందిని చంపినారు. అందరు నక్సలైట్లే అని దబాయించారు. ఏమైనా పోలీసుల ఆట చెల్లుతుందని చూస్తున్నారు. నీవు మాత్రం వచ్చే వాయిదాకు పోకు. పోలీసులకు ఒంటరిగా దొరకకుండా ఉండేసరి" తనకు కావలసిందే రుషి చెప్పేసరికి లట్టి ముఖంపై చిరునవ్వు కనపడింది. "ఎదురు తిరగాల్సిందే" అన్నాడు లట్టి.

రుషి లేచివచ్చి దళ సభ్యుల్ని కిట్లు వేసుకోమన్నాడు. క్యాంపెయిన్ అక్కలు ఒక పక్క నిలబడ్డారు. దళం అన్నలు ఒకవైపు నిలబడ్డారు. "కామ్రేడ్స్ ! ఇక్కడి నుండే ఎవరి రూట్ ప్రకారం వారుపోవాలి. తిరిగి కలుసుకుందాం" అని రుషి అనగానే వీడ్కోలుగా అందరు షేక్ హాండ్‌లు ఇచ్చుకోవడం మొదలైంది. నెగడు వెలుగులో ఒకరి ముఖాల్లోకి ఒకరు చూసుకుంటూ "మళ్ళీ కలుద్దాం కామ్రేడ్," అన్నట్టు ఆప్యాయంగా చూసుకుంటున్న జైని చేయి కలిపినపుడు "జాగ్రత్త" అంటూ రుషి చూపులు క్షణకాలం ఆమె చూపుల్లో నిలిచిపోయాయి.

(ఇంకా ఉంది)

# నర్మద ఉద్యమం నడవవలసిన దారి

కె. అనూరాధ

నర్మద ఈ రోజున ఒక నది మాత్రమే కాదు. ఒక సమస్య, ఒక పోరాటం, ఊపిరి పోసుకుంటున్న కొత్త చైతన్యం. పర్యావరణ ఉద్యమాన్ని కూడలిలో నిల బెట్టింది నర్మద. ఒక రకంగా చెప్పాలంటే కేవలం పర్యావరణ ఉద్యమాన్నే కాక నూతన సామాజిక ఉద్యమాలన్నిటినీ ఈ రోజు నర్మద సవాలు చేస్తోంది.

మన దేశంలో పర్యావరణ సమస్య కేవలం మనం అనుసరిస్తున్న అభివృద్ధి విధానం నుండి పుట్టుకొచ్చిందేనని పర్యావరణ మేధావుల విశ్వాసం. 1970లలో మొదలైన చిప్కో ఉద్యమం నుండి ఈనాటిదాకా పర్యావరణ ఉద్యమం ఆ దిశగానే పయనించింది. చారిత్రక క్రమాన్ని పరిశీలిస్తే గాంధీవాద అహింసామార్గం నుండి బయలుదేరి 'తగిన సాంకేతిక విధానం' వైపుకు ప్రయాణించింది. మొదటి దశలో పర్యావరణ ఉద్యమం అహింసకీ శాంతికీ మరో రూపంగా భావించబడేది. క్రమంగా శాస్త్ర సాంకేతిక అభివృద్ధి ఫలితాలవల్ల అది సాంకేతిక స్థాయిలో పరిష్కారం కుదరదనే సత్యాన్ని నర్మద ప్రజల పోరాటం ఈనాడు బట్టబయలు చేసింది.

అదే విధంగా న్యాయవ్యవస్థ కూడ తన రంగును బయట పెట్టుకున్నది. గతంలో డూన్ లోయలో పాలరాతి క్వారీలను నిషేధిస్తూ సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పుకు అందరూ హర్షించారు. కాని అదే న్యాయవ్యవస్థ నర్మద విషయంలో చాల అన్యాయంగా ప్రవర్తిస్తోంది.

నర్మద వ్యాలీ ప్రాజెక్ట్ ప్రతిపాదన స్థాయినుండే ఎన్నో విమర్శలను ఎదుర్కొంటూ చివరికి 1987 ఏప్రిల్‌లో ప్రభుత్వ ఆమోదాన్ని పొందింది. దీని నిర్మాణంలో మొత్తంగా 3000 పెద్ద, చిన్న ఆనకట్టలు నిర్మించబడతాయి. వీటిలో ముఖ్యమైన రెండు ఆనకట్టలు గుజరాత్‌లోని సర్దార్ సరోవర్, మధ్యప్రదేశ్‌లోని నర్మదాసాగర్, ప్రపంచంలోనే ఎక్కడా కనీవినీ ఎరగనంత స్థాయిలో నీటిని నిల్వ చేస్తాయి. ప్రపంచవ్యాప్తంగా భారీ నీటి ఆనకట్టల నిర్మాణానికి తీవ్ర వ్యతిరేకత వస్తున్న దశలో ప్రపంచ బ్యాంక్ ఆర్థిక సహాయంతో నిర్మించబడుతున్న నర్మదా వ్యాలీ ప్రాజెక్ట్ చాల వివాదాస్పదం అయ్యింది. ఈ ప్రాజెక్ట్ నిర్మాణం పర్యావరణం మీద విషమ ప్రభావాన్ని చూపడమేకాక పది లక్షలమంది ప్రజల్ని నిర్వాసితులుగా

పోరుస్తుంది. వారిలో అధిక శాతం నోరులేని గిరిజనులు. కొన్నివేల గ్రామాలను, పంట భూములను, అడవిని ముంచేసే ఈ ప్రాజెక్ట్ ప్రపంచంలోనే అతి పెద్దది అవుతుంది. దానికి తగ్గట్టుగానే నష్టం కూడా అత్యధికంగా వుంటుంది.

జరగబోయే విషాదం గురించి గత నాలుగు సంవత్సరాలుగా అనేక పర్యావరణ మేధావులు ఎప్పటిలానే గగ్గోలు పెడుతూ వున్నారు. ప్రభుత్వం మాత్రం యేమీ జరగనట్లు నిశ్చింతగా వుంది. ఈ సమస్య కేవలం కొద్దిమంది పర్యావరణ వాదులకీ, సంఘ సేవకులకూ మాత్రమే పరిమితం అయివుంటే సమస్య ఇంత సంక్లిష్టంగా మారేది కాదు. ఇంతకు ముందు కూడ తెహరీ, ఇచ్ఛంపల్లి, కొయల్ కారొ వగైరా భారీ నీటి ఆనకట్టలను వ్యతిరేకిస్తూ ఎన్నో విమర్శలు వచ్చాయి. కాని ఆ వ్యతిరేకత అక్కడ ప్రజలనుండి అంత బలంగా రాకపోవడంవల్ల, ప్రభుత్వం వైపునుండి కనీస సమాధానం కూడా లేకుండా పోయింది. నర్మద విషయంలో అలా జరగలేదు. ప్రజలు మొదటి దశనుండి భారీ ఎత్తున కదిలారు, నిర్విరామంగా పోరాడు తున్నారు. పర్యావరణ ఉద్యమ చరిత్రలో ఇది చెప్పుకోదగ్గ మెట్టు.

నర్మదా ప్రాజెక్ట్ నిర్మాణాన్ని ప్రశ్నిస్తూ వేసిన నాలుగు రిట్ పిటిషన్లు ఇప్పటికీ పెండింగ్‌లోనే వున్నాయి. గుజరాత్ హైకోర్టులో ఒకటి, బొంబాయి హైకోర్టులో రెండు, థానే జిల్లా కోర్టులో ఒకటి. వీటిలో నిర్వాసితుల పునరావాస హక్కుకు సంబంధించి, జీవించే హక్కుకు సంబంధించిన పిటీషన్లు వున్నాయి. కేసుల విచారణ ఇంతవరకూ మొదలు కాలేదు.

ఆ క్రమంలోనే 1989 సెప్టెంబర్ 28న మధ్యప్రదేశ్‌లో హర్సూద్ అనే గ్రామంలో 30,000 మంది ప్రతినిధులతో బ్రహ్మాండమైన ర్యాలీ జరిగింది. 'వినాశకర అభివృద్ధి'కి వ్యతిరేకంగా జాతీయ స్థాయిలో జరిగిన ఈ ర్యాలీకి అనేక రాష్ట్రాలనుండి ప్రజలు తమ మద్దతు తెలపడానికి హర్సూద్ చేరుకున్నారు. అప్పుడు, ఇన్నాళ్ళుగా మౌనం వహించిన ప్రభుత్వం జవాబుదారీకాక తప్పలేదు. మును పెన్నడు లేని విధంగా నర్మద ప్రాజెక్ట్‌ను సమర్థిస్తూ, దాని లాభాలను చాటుతూ ఒక సంఘం పేరు పెట్టుకుని పెద్ద ఎత్తున ప్రచారం ప్రారంభించింది. ఇదంతా గుజరాత్ ముఖ్యమంత్రి చిమన్ భాయిపటేల్ ఆధ్వర్యంలో జరిగింది. శాస్త్రజ్ఞులతో ప్రాజెక్ట్ నిర్మాణం వల్ల కలిగే లాభాల గురించి వ్యాసాలు రాయించడమేగాక, ఇంకాస్త ముందుకు పోయి బొంబాయి నగరంలో కాంట్రాక్టర్లతో, వ్యాపారస్తులతో ప్రాజెక్ట్ నిర్మాణానికి మద్దతుగా ఊరేగింపు కూడ జరిపించింది ప్రభుత్వం.

మరో పక్క నర్మద ఆందోళనకారుల మీద నిర్బంధకాండ మొదలైంది. అన్నిటికన్నా చిత్రంగా అధికార రహస్యాల చట్టాన్ని నర్మద ప్రాజెక్టుకు వర్తింప జేసి విచ్చలవిడిగా అరెస్టులు సాగించింది. ప్రభుత్వ నిర్బంధాన్ని ఎదుర్కొంటూనే నర్మద ప్రజలు కొత్త కొత్త రూపాలలో పోరాడుతూనే వున్నారు. ఇటీవల జూలై నెలలో మణిబేలిలో నర్మద ఆందోళనకారులు చూపిన ప్రతిఘటన శక్తి ఉద్యమానికి కొత్త రూపాన్ని ఇచ్చింది. సర్దార్ సరోవర్ ఆనకట్ట వల్ల మొట్టమొదలు ముంపుకు గురయ్యే ఊరు మణిబేలి. మహారాష్ట్రలో ధూలే జిల్లాకి చెందిన ఈ చిన్న గ్రామం పోరాట పటిమకు సాక్షిగా నిలిచింది. అక్కడ ప్రజలు "మునిగిపోతాం కాని కదలం" (డూబేంగే మగర్ న హఠేంగే) అనే నినాదంతో పట్టుదలగా వుండగా, అనేక రాష్ట్రాల నుండి వాళ్ళ పోరాటానికి మద్దతు ప్రకటించడానికి వచ్చిన కార్యకర్తలు జూలై 14న మణిబేలిలో నర్మద ఒడ్డున 'నర్మదాయి' శిబిరాన్ని ఏర్పర్చుకుని సత్యాగ్రహం ప్రారంభించారు. నర్మద ప్రజలతో గత ఆరు సంవత్సరాలుగా వుండి వారి తలలో నాలుకగా కలిసిపోయిన మేధా పాటర్ నాయకత్వం కింద మొట్టమొదటి 'సమర్పిత దళం' సత్యాగ్రహం ప్రారంభించింది. ఎంత శాంతియుత సత్యాగ్రహమైనా సహించే స్థితి మన ప్రభుత్వం కోల్పోయింది గనక 66 మంది ప్రదర్శనా కారులను ఆగస్టు 4న, ఆత్మహత్యా నేరం కింద అరెస్టు చేసి జైల్లో పెట్టి, ఆ ప్రాంతంలో 144 సెక్షన్ విధించింది. మేధా పాట్‌కర్ అరెస్టు తప్పించుకొని రహస్యంగా వెళ్ళవలసి వచ్చింది. ఈ ప్రజా ఉద్యమాన్ని కూడ భారత ప్రభుత్వపు మెడలు వంచడానికి తన చేతిలో సాధనంగా వాడుకోవడానికి ప్రపంచ బ్యాంకు ప్రయత్నిస్తోంది. మొదట తానే ఆమోదించి, నిధులిచ్చిన ఈ ప్రాజెక్టును మళ్ళీ పరిశీలించడానికి ఒక బృందాన్ని పంపింది. మరోవైపు ప్రభుత్వం నిర్బంధాన్ని తీవ్రతరం చేసి మేధా పాట్‌కర్‌ను అరెస్టు చేసి రెండురోజుల తర్వాత విడుదల చేసింది. ఇది ఇప్పటి వరకు జరిగిన చరిత్ర.

'నర్మద బచావో ఆందోళన్' గత నాలుగు సంవత్సరాలుగా ఎంతో నిలకడగా పోరాడడమేగాక ఎన్నో విషయాలను వెలికి తీసింది. ఇప్పటి వరకూ జరిగిన పర్యావరణ ఉద్యమాలకు ఒక ప్రశ్నార్థకంగా నిలిచింది. మొట్ట మొదటిసారిగా భారీఎత్తున ప్రజలు కదలడం తమ సమస్య కొరకు తామే పోరాడడమనేది నర్మద ఉద్యమ ప్రత్యేకత. గతంలో జరిగిన చిప్కో ఉద్యమంలోనైనా ఇతర ఏ పర్యావరణ ఉద్యమంలోనైన ఇంతమంది ప్రజలు పాల్గొనలేదనే చెప్పాలి. చిప్కో నుండి నర్మదవరకూ సాగిన క్రమంలో ప్రజల చైతన్య స్థాయి పెరిగింది. నర్మద ప్రజల పోరాట స్ఫూర్తి ఆ క్రమం అంతటితో ఆగదనే విశ్వాసాన్ని కలిగిస్తుంది.

చిప్కో నుండి నర్మద వరకు పరిణామక్రమాన్ని తాత్వికంగా పరిశీలిస్తే పర్యావరణ ఉద్యమ వర్తమానాన్ని, భవిష్యత్తును అర్థం చేసుకోగలం. చిప్కో నాటికి ప్రజలలో పర్యావరణం పట్ల యే ప్రాపంచిక దృక్పథం లేదు. ఆ ఉద్యమానికి నాయకత్వం వహించిన గాంధీవాద ఆదర్శవాద వైఖరివల్ల పర్యావరణ సమస్య మరి దేనితో సంబంధం లేని ప్రత్యేక సమస్యగానే కాక మొత్తంగా సామాజిక అభివృద్ధి క్రమం నుండి విడదీసి చూడబడింది. చిప్కో ఉద్యమకారులకు విస్తృత పర్యావరణ దృక్పథం ఉండిందని ఇప్పుడు కొందరు సామాజిక శాస్త్రవేత్తలు చేస్తున్న ప్రయత్నం ఖండించవలసిందే. ఈ రకమైన ప్రయత్నానికి భిన్నంగా, రామచంద్ర గుహ తన పరిశోధనా గ్రంథంలో చిప్కో సామాజిక చారిత్రక నేపథ్యాన్ని చాల లోతుగా చర్చించారు. చిప్కోని కేవలం పర్యావరణ ఉద్యమంగా చూడరాదని, అది ప్రధానంగా భూమి సమస్య, అడవి మీద ప్రజల హక్కుకు సంబంధించిన సమస్య అని ఆయన వాదన. తెహరీ గఢ్‌వాల్ చరిత్రను చూస్తే బ్రిటిష్ వలసవాదులకు వ్యతిరేకంగా అక్కడి ప్రజలు అడవి మీద తమకున్న హక్కు కోసం 18వ శతాబ్దం నుండి మొదలుకుని అనేక పోరాటాలు చేసారు. ఆ పోరాటాల కొనసాగింపే చిప్కో ఉద్యమానికి దారి తీసిందని గుహ అంటారు.

ఆ రకంగా భూమికోసం, బతుకుదెరువు కోసం మొదలైన తెహరీ గఢ్‌వాల్ ప్రజల పోరాటం 1970ల నాటికి పర్యావరణ పోరాటంగా రూపుదిద్దుకుంది. గాంధీ శిష్యురాలైన మీరాబెన్, సరళాదేవిల నాయకత్వం కింద ప్రజలు, ముఖ్యంగా స్త్రీలు అడవిని కాపాడుకోవడం కోసం పోరాడారు. పర్యావరణంలో అడవికి ఉన్న ప్రాముఖ్యతను గురించి తెలుసుకున్నారు. ఇది ఆనాటి ఉద్యమ పాటల్లో స్పష్టంగా కనబడుతుంది.

నర్మద ఉద్యమం అక్కడ నుండి ముందుకు నడచి వచ్చి పర్యావరణ సమస్య మనదేశ అభివృద్ధి విధానంతో ముడిపడి వుందన్న విషయాన్ని గుర్తించింది. హర్సూద్‌లో 'వినాశకర అభివృద్ధి'ని వ్యతిరేకిస్తూ జరిగిన ర్యాలీ దీనికి నిదర్శనం. దృక్పథం విషయంలో మార్పు వచ్చినా నాయకత్వంలో మాత్రం పెద్ద మార్పు రాలేదు. మేధా పాట్‌కర్, బాబా ఆమ్టే, సుందర్‌లాల్ బహుగుణ వంటి గాంధీవాదులు సంకల్ప యాత్రలు, సత్యాగ్రహాలతో కాలం గడుపుతున్నారు. మేధా పాట్‌కర్ నర్మద ప్రజల్లో ఒకరిగా కలిసిపోయి ఆ ఉద్యమానికి చేస్తున్న కృషిని అభినందిం

చినా ఆమె చేపట్టిన మార్గం ఆమోదయోగ్యం కాదు. ఇటీవల ఆమె విదేశీ వస్తువుల వాడకాన్ని నిషేధించాలని నినాదం కూడా ఇచ్చారు. ఉద్యమ స్థాయి ఎంతో పెరిగి నప్పటికీ, నాయకత్వం మాత్రం సాంప్రదాయిక పద్ధతులను వదులుకోలేదు.

మరొక పక్క సామ్రాజ్యవాద గుప్పెట్లోకి రోజు రోజుకూ కూరుకుపోతున్న రాజ్యం తన అణచివేత స్వభావాన్ని మరింత బయటపెట్టుకుంటోంది. ఎంత శాంతి యుతం అయినప్పటికీ ఉద్యమాన్ని అణచివేయడానికి అన్ని రకాల పద్ధతులను అవలంబిస్తోంది. అరెస్టులు, దొంగకేసులు, గ్రామాల మీదపడి ప్రజలను హింసించడం, స్త్రీలను వేధించడం వగైరా మామూలుగా జరిగిపోతున్నాయి. రాజ్యహింసను అహింసతో ఎదుర్కోవాలని నమ్ముతున్న మేధా పాట్కర్‌కి కూడా రహస్య జీవితం తప్పలేదు. ఇంక మిగిలింది ఒక్క టాడా కేసులు బనాయించడం మాత్రమే. ఉద్యమ స్థాయికి తగ్గట్టుగా నాయకత్వ స్థాయి పెరగలేదు. అందుకు కారణం పర్యావరణ సమస్యను మొత్తంగా సామాజిక విధానంలో భాగంగా చూడకపోవడమే. ప్రస్తుతం అమలులో వున్న మన అభివృద్ధి విధానాన్ని దోషిగా నిలబెట్టడంతో సరిపోదు. ఈ అభివృద్ధి విధానం సామ్రాజ్యవాద శక్తులు, దాని ప్రతినిధులైన బూర్జువా వర్గం, స్థానిక భూస్వామ్య వర్గాలతో కలిసి తీర్చిదిద్దినదే. ఇది అర్ధ వలస - అర్ధ భూస్వామ్య విధానానికి పునాది. పెట్టుబడికి వేగంగా విస్తరించే స్వభావం వుండటం వల్ల అంతర్జాతీయంగా పెట్టుబడి ప్రవహిస్తుంది. మన దేశంలో కూడా పోగుబడుతున్న పెట్టుబడి అనేక రూపాల్లో ప్రవహించి సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలన్నిటిలో అసమానతలను పెంచి పోషిస్తోంది. పర్యావరణ సంక్షోభం కూడ ఆ అసమానత ఫలితమే, ఆ అసమానతల్లో భాగమే. కాబట్టి పర్యావరణ సమస్యను సామాజిక చలన సూత్రాల ద్వారానే అర్థం చేసుకోగలం.

ఇన్నాళ్ళ శాంతియుత పోరాటం తర్వాత నర్మద ఉద్యమకారులు మళ్ళీ ఒకసారి తమ మార్గాన్ని ఎంచుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇది ఒక రకంగా ప్రజాస్వామికవాదులందరూ ఆలోచించాల్సిన పరిస్థితి. సామ్రాజ్యవాదానికీ పర్యావరణ సమస్యకూ వున్న అవినాభావ సంబంధాన్ని గుర్తించనంత కాలం ఇది గాలితో యుద్ధం చేయడమే అవుతుంది. గుర్తించినప్పుడు అది సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాతంత్ర ఉద్యమంగా మారుతుంది. ఆ విషయాన్ని ఈ రోజున నర్మద ఉద్యమ నాయకత్వం గుర్తించకపోయినా, ప్రజలు తప్పక గుర్తిస్తారు. ○

# అల్లం రాజయ్య కథల్లో 'పరాయీకరణ'

ఎన్. వేణుగోపాల్

పరాయీకరణకు గురవుతున్న మనిషి గురించి తపనపడడం, ఆ పరాయీకరణ రూపాలనూ, సారాంశాన్నీ అర్థం చేసుకోవడం, పరాయీకరణను మనిషి ఎట్లా అధిగమించగలడని ఆలోచనలు చేయడం మార్క్సిజంలో ఒక ముఖ్యమైన భాగం. మనిషి తన నుంచి తాను ఎందుకు దూరమవుతున్నాడని అన్వేషించే క్రమంలోనే మార్క్స్ పరాయీకరణకు మూలం 'శ్రమ పరాయీకరణ'లో ఉన్నదని గుర్తించాడు. శ్రమ, పరాయీకరణే మనిషిని అమానవీయం చేస్తున్నదనీ గుర్తించింది. స్వంత ఆస్తికీ, దురాశకూ, శ్రమ విభజనకూ, పెట్టుబడికీ, భూమి రూపంలో ఉన్న ఆస్తికీ మధ్య ఉన్న అంతర్గత సంబంధాన్నీ, వినిమయానికీ పోటీకీ మధ్య, విలువకూ మనిషి విలువ పడిపోవడానికీ మధ్య, గుత్తాధిపత్యానికీ పోటీకీ మధ్య ఉన్న సంబంధాన్నీ అర్థం చేసుకోవలసి ఉంటుందని మార్క్స్ అన్నాడు. ఈ మొత్తం పరాయీకరణ డబ్బు వ్యవస్థతో ముడిపడి ఉండడాన్ని అర్థం చేసుకోవలసి ఉంటుందని అన్నాడు.

పరాయీకరణ సమాజంలో అతి సాధారణంగా జరిగిపోతూ ఉంది. అది సహజమనిపించేటంతగా మన జీవితాల్లో పరాయీకరణ ఉంది. జీవితాన్ని యథాతథంగా, నిజాయితీగా చిత్రించదలచిన ఏ కళాకారునికైనా, రచయితకైనా పరాయీకరణ ఒక అనివార్య వస్తువవుతుంది. కాగా మార్క్సిస్టు రచయితలకు పరాయీకరణను చిత్రించే బాధ్యత మరింతగా పెరుగుతుంది. వాళ్ళు పరాయీకరణ భావనను సక్రమంగా అర్థం చేసుకోవాలి. స్వంత ఆస్తి సంబంధాల ఫలితంగా సమాజంలో పెరిగిపోతున్న అమానవీకరణను అర్థం చేసుకోవాలి. ఈ పరాయీకరణ, అమానవీకరణ ఎన్నెన్ని రూపాలలో, ఎన్నెన్ని విధాలుగా సాగుతున్నదో గుర్తించి, విశ్లేషించాలి. అన్నిటికన్న ముఖ్యంగా ఆ పరాయీకరణను ఎదుర్కోగల పోరాట ఆవశ్యకతను వివరించాలి. ఇప్పుడు తెలుగు కవిత్వంలో విరివిగా వెలువడుతున్నట్టుగా కేవలం పరాయీకరణను (తెలుగు కవిత్వంలో పరాయీకరణ కానిది కూడ పరాయీకరణగా చలామణీ అవుతోంది, అది వేరే కథ!) చిత్రించడంతో ఆగిపోకుండా, ఆ పరాయీకరణను అధిగమించే మార్గాలను సూచించడం మార్క్సిస్టు రచయితలు తప్పనిసరిగా చేయవలసిన పని.

ఈ దృష్టితో పరిశీలించినప్పుడు అల్లం రాజయ్య రాసిన 'మనిషి లోపలి విధ్వంసం' (ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక, ఏప్రిల్ 14, ఏప్రిల్ 21, 1989, పునర్ముద్రణ : భూమిక, కథా సంకలనం,), 'మధ్యవర్తులు' (ఆంధ్రజ్యోతి, దీపావళి

సంచిక 1990, పునర్ముద్రణ : అరుణతార, ఆగస్ట్ 1991) కథలు అవసరమైన విషయాలను, అవసరమైన పద్ధతిలో చిత్రించినట్టు గుర్తించవచ్చు. ఈ కథలలో పరాయీకరణ క్రమం, ఫలితాలు చిత్రణ పొందినంతగా, పరాయీకరణను అధిగమించే క్రమం చిత్రణ పొందనప్పటికీ ఈ కథల విశ్లేషణ ఈ సమస్యలను అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతుంది.

పరాయీకరణను ఒక అర్థంలో మనిషి లోపలి విధ్వంసంగా చూపవచ్చు. మనిషి మనిషిగా మిగలడు. లోలోపల ధ్వంసమైపోతాడు. తాను సాగించిన శ్రమ ఉత్పత్తి పరాయిదయిపోతుంది. అసలు ఆ శ్రమ క్రమమే తనదిగా అనిపించదు. తాను ఒక సంఘ జీవిననే స్పృహ పోతుంది. తనలోని మానవీయ లక్షణాలు మాయమైపోతాయి. తనకు తానే పరాయి మనిషిలా ఉంటాడు. ఇట్లా లోలోపల విధ్వంసమైపోయిన మనిషి మళ్ళీ మనిషిగా మారాలంటే ఆ విధ్వంస శక్తుల మీద పోరాటానికైనా సిద్ధపడాలి. లేదా రాజీపడి పరాయిగా, అమానవీయంగా బతుకు గడుపుతూ ఉండాలి.

'మనిషి లోపలి విధ్వంసం' కథలో పాత్రలేవీ విధ్వంస శక్తుల మీదపోరాటానికి సిద్ధపడినవి కావు. కాని కథ నేపథ్యంలో అటువంటి పోరాటం ఉన్నదని రెండు మూడు సంభాషణల్లో బైట పడుతుంది. కనీసం ఒకటి రెండు పాత్రలలోనైనా ఈ అమానవీయ విలువలను ఎదిరించాలనే పెనుగులాట ఉంది. అయితే ఆ పాత్రలకు కూడ పోరాట మార్గం గురించిన స్పష్టత లేదు. ఒక పాత్ర అసంకల్పితంగా, సహజంగా మానవీయంగా ప్రవర్తిస్తే, మరో పాత్ర అమానవీకరణను ఎదిరించడానికి 'సకల విలువల విధ్వంసం' లాంటి దానికి పాల్పడి, చివరికి దిక్కుతోచని కూడలిలో మిగిలిపోతుంది.

మనిషికి తాను సంఘజీవిననే స్పృహ లేకపోవడం, తోటి మనిషి పట్ల ప్రేమ లేకపోవడం, దుఃఖితుల పట్ల సానుభూతి లేకపోవడం పరాయీకరణకు ఒక కోణం. ఇంకా మీసాలు సరిగా మొలవని యువకుడు రైలు కింద పడి చచ్చిపోతే ఎవరు, ఎందుకు చనిపోయాడు అని తెలుసుకోవాలనే ఆసక్తి కూడ కనబరచని స్టేషన్ మాస్టర్ "వాడు ఏదైతే మనకేమిటి గని-మన నెత్తిమీదికి తెచ్చాడు. ప్యాసింజర్ వెళ్ళిపోతే ఈ చలిలో రాత్రంతా చావాల్సిందే" అంటాడు.

పరాయీకరణ నుంచి రూపొందే తప్పుడు చైతన్యానికి ఒక వ్యక్తీకరణ యథాతథ స్థితిని సమర్థించడం. యథాతథ స్థితిని సమర్థించడానికి రెండు కారణాలుండవచ్చు : ఒకటి, ఆ స్థితి కొనసాగడంవల్ల తమకు మేలు జరగడం. వర్గ సమాజాన్ని సమర్థించే వాళ్ళలో కొందరికి ఇటువంటి స్వార్థ ప్రయోజనం ఉండడం

గమనించవచ్చు. రెండో కారణం, సమాజంలో కొనసాగే పరాయీకరణ తప్పుడు చైతన్యాన్ని, సరుకుల మాయను కల్పిస్తుంది. ఈ మాయవల్ల ప్రపంచం తల కిందులుగా కనబడుతుంది. హింసా హింసలకు, న్యాయాన్యాయాలకు రెండు రకాల వివరణలుండడానికి కారణమిదే. మరీ ముఖ్యంగా ఈ రెండు కారణాలా - అంటే తమకు ఎంతో కొంత మేలు, తప్పుడు చైతన్యం - కలగలసినప్పుడు యథాతథా స్థితికి బలమైన సమర్థత ఉంటుంది. సామాజికంగా సురక్షిత స్థితిలో ఉన్నవాళ్ళు ఈ సమర్థనను ప్రకటిస్తుంటారు. అందుకే రైల్వే పోలీసు రంగయ్య వేదాంతం కూడ కలగలిపి "అరె ! కష్టాలుంటయి, సుఖాలుంటయి. మనిషి పుటుకే అసొంటిది. ఇయ్యేల్ల రేపటోల్లకు అన్ని ముంగటికి రావలె" అంటాడు.

ఈ రెండు పాత్రలకు భిన్నంగా లోలోపల విధ్వంసమై కూడ విధ్వంసానికి వ్యతిరేకంగా పెనుగులాడుతున్న రాయేశం, రాజారాం పాత్రలున్నాయి.

రాయేశం కార్మికుడు. గని కార్మికుడంటే కచ్చితంగా పల్లెసీమల నుంచి వచ్చి బతుకు దెరువు కోసం కార్మికుడయిన వాడయి ఉంటాడు. అందుకే సాంప్రదాయక అర్థంలో పరాయీకరణను అనుభవించిన, అనుభవిస్తున్న వాడూ కాదు, పరాయీ కరణను ఎదిరించాలని చైతన్యం ఉన్నవాడూ కాదు. గ్రామీణ జీవితంలోని సంఘ జీవిత స్పృహ, విస్తృత జీవితానుభవం, కార్మిక జీవితంలో సంఘటితమవుతున్న చైతన్యం అన్నీ మిళితమైనవాడు. "మనిషి జల్మంత పాపకారి జల్మ మరోటి లేదు'' అని గుర్తించినవాడు. ఒక బహిరంగ హింసకు, మృత్యువును చూసి, విధ్వం సాన్ని మరిచి పోయేందుకు సారా పాకెట్లతో మంట చల్లార్చుకుంటాడు. కారణాలా, పరిష్కారాలా స్పష్టంగా తెలియకపోయినా పరిస్థితి సరిగ్గానే అర్థం చేసుకుంటాడు. అందుకే "నిన్ను సిలువకు గట్టిరి బిడ్డా నా యేసయ్యా, కీలు కీలున మొలలు గొట్టిరి తండ్రీ నా యేసయ్యా" అని కుంటి బిచ్చగాడు పాడితే "ఏసయ్యను కాదు, గరీ బోన్ని'' అని సరిదిద్ద గలుగుతాడు. "తోటి కార్మికులు గనిలో చనిపోయినప్పుడు మిగతా కార్మికుల్లో చెలరేగిన కోపం అతని ముఖంలో" కూడ చిమ్ముకొస్తుంది గనుక తోటి మనుషుల కష్టాల పట్ల సానుభూతి, దుఃఖంలో ఉన్నవాళ్ళకు సాయం చెయ్యాలనే మానవీయ స్పృహ ప్రదర్శిస్తాడు.

ఈ లోకంలో చావు బతుకుల గురించి, మంచి చెడుల గురించి కూడ రాయే శానికి స్పష్టమైన అభిప్రాయాలే ఉన్నాయి. "గీడ నియ్యత్ గలోన్ని, నోట్ల నాలిక లేనోన్ని బతుక నియ్యరు.... అరరె! ఎవల్లన్న మనిషి దగ్గరికి తీసి కడుపుల ఆయత్తం అడిగితె బతికిపోవు ... ఎంత పని జర్గిపాయె" అంటాడు మృత్యువును

చూసి. "సచ్చిపోని బావవా ? అన్నవా ?" అని రైల్వే పోలీసు బంధువయితే తప్ప తోటి మనిషి గురించి పట్టించుకోగూడదన్నట్టు, మానవ సంబంధం మీద బాంధవ్య రాజముద్ర వేస్తే, "అంతకన్న ఎక్కువ" అని మనిషికీ మనిషికీ ఉండవలసిన సంబంధం గురించి చెపుతాడు. కొడుకు చావు సంగతి తెలిసి గూడ రాజారాం చలించకపోతే, అతని లోపల ఎంత విధ్వంసం జరిగిందో తనకు తెలుసునన్నట్టు తడిగొంతుతో ఆప్యాయంగా పలకరిస్తాడు.

రాయేశం పాత్రకన్న ముఖ్యమైన పాత్ర రాజారాంది. రాజారాం "ఒక ధ్వంసమైన పల్లె". "ఎలుగడి బడి సొంతం కాలిపోయి, చల్లారిన అడవి". "ఇంకి పోయిన నది", నెర్రెలెచ్చిన ఎండిన చెరువు. మాటలు తెగిపోయిన మనిషి. ఒక అసహజ అస్తిత్వానికి, పరాయితనానికి చిహ్నం రాజారాం. మరి ఇప్పుడు బతికి ఉన్నట్టే కనిపిస్తున్న రాజారాం నిజానికి ఎప్పుడు చచ్చిపోయాడు? "తన కలల ప్రపంచాన్ని ఎవరు విధ్వంసం చేశారు ? ఎప్పుడు చేశారు ? తన ఏడుపు ఎక్కడ ఎప్పుడు తెగిపోయింది ? తను బండరాయా ? తన నరాలు ఒక్కటొక్కటే పుటుక్కు పుటుక్కున తెంపిందెవరు ?"

రాజారాం తండ్రి చిన్నతనంలోనే చనిపోయాడు. అన్న తాగి తాగి చని పోయాడు. కుటుంబం చెల్లాచెదురయింది. రాజారాం చదువు ఆపి వ్యవసాయంలో కొచ్చి కుటుంబాన్ని సంరక్షించవలసి వచ్చింది. అప్పటికి పది ఎకరాల భూమి ఉండేది. బావి తవ్వడం కోసం అంజుమన్ అప్పు. ఆ అప్పు తీరకుండానే మిరప కాయ పంటకోసం, ఇంజన్‌కోసం భూతనఖా బ్యాంకు అప్పు. పంటాపోయింది, ఆస్తి బోయింది. రైతు రాజారాం కూలీగా మారిపోయాడు. భార్య కొడుకుని తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది. తాగుబోతుగా, దొరదగ్గర జీతగాడిగా, తునికి ఆకు కల్లం గుత్తేదారుగా, ఉద్యమంలోకి పోయిన యువకుడికి జమానతుదారుగా రాజారాంలో అనేక మార్పులు వచ్చాయి. చిట్టచివరికి విధ్వంసమైపోయిన రాజారాం మిగిలాడు. కొడుకు శవమై కళ్ళముందుంటే కళ్ళు చెమర్చని రాజారాం, కొడుకు అంతిమ సంస్కారానికి వెళ్ళాలో లేదో తేల్చుకోలేని రాజారాం, సారామత్తును మించిన మత్తును అనుభవించే రాజారాం.

"ఈ విధ్వంసం ప్రతి పల్లెలో, ప్రతి రైతు లోలోపల జరిగింది. రైతు లంతా తమ గాయాలు దాచుకొని, విధ్వంసాన్ని మింగుకొని తిరుగుతున్నారు. తుపాను గాలిలో ఎండుటాకుల్లా ఎగురుతున్నారు."

రాజారాం పొందిన పరాయీకరణ కొంచెం సంక్లిష్టమైనది. దానిలో శ్రామి

కుడి పరాయీకరణా ఉంది, శ్రామికుడు కాని వ్యక్తి పరాయీకరణా ఉంది. మధ్య రైతు స్థాయినుంచో, చిన్నరైతు స్థాయినుంచో దిగజారుతూవచ్చి రాజారాం మనకు కనబడుతున్న స్థితికి చేరాడు. ఈ క్రమంలో చాలదూరం రాజారాంకు స్వంత ఆస్తి ఉన్నది. అప్పుడే అతనిలో విధ్వంసం ప్రారంభమైంది. ఆ ఆస్తి అంతా కరిగిపోయి, భార్యాబిడ్డలు వెళ్ళిపోయినాక రాజారాంకు తన విధ్వంసం గురించి తెలిసి వచ్చింది. అంటే విధ్వంసానికి మనిషిలోపలి మానవసారం ధ్వంసమైపోవడం అనే అర్థం కాక, ఆస్తి ధ్వంసం అయిపోవడం, రక్తబంధాలు ధ్వంసమైపోవడం అనే అర్థమిచ్చుకున్నాడు రాజారాం.

అప్పుడైనా రాజారాం ఎంచుకున్న మార్గం ఈ విధ్వంసాన్ని ఎదిరించి, భూమితో, భూమికొరకు పోరాటంతో సంబంధం పెట్టుకునేది కాదు. తనలో అమానవీయ విలువలు నింపిన వ్యవస్థను ఎదిరించి మానవీయ విలువలవైపు పయనించడం కాదు. "బేవార్సు, ఆవారా, కరీంనగర్ సబ్‌జేల్ల ఏడాది ఉండచ్చిన పాతకాపు" అని చెప్పదగిన నిర్వ్యాపక జీవితం గడపడం ప్రారంభించాడు. ఒకానొక చారిత్రక దశలో ఇటువంటి నిర్వ్యాపకత్వం కూడ ఉన్న స్థితిమీద నిరసనకు, ధిక్కారానికి సూచిక కావచ్చు. కాని రాజారాం జీవిస్తున్నది 1980ల కరీంనగర్ జిల్లాలో. ఈ చారిత్రక సందర్భంలో ఇమడకుండా రాజారాం "కాలి కూలి బూడిదైన పల్లెలో కొడుకెవరు? తండ్రెవరు?" అనే నిహిలిస్టు ఆలోచనా ధారకు దగ్గరయ్యాడు. అందువల్లనే చివరికి "ఆలోచనలు ఇంకిపోయి మర్రిచెట్టుకింద కూలబడిపోయి రెండు చేతులతో ముఖం, తల రుద్దుకుంటూ లోలోపల పూర్తిగా ధ్వంసమైపోయిన రైతుబిడ్డడు. రైతుబిడ్డడు రాజారాం ఏడుస్తున్నాడు. వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. పూర్తిగా బొట్టుబొట్టు కరిగిపోతూ భూమి లోపలికి ఇంకిపోతూ ఏడుస్తున్నాడు".

పూర్తిగా పెట్టుబడిదారి ఉత్పత్తి సంబంధాలు రూపొందనిచోట పరాయీకరణా, దానికి ప్రతిస్పందనా కూడ ఇంత క్లిష్టంగానే ఉండక తప్పదేమో. ఈ పరాయీకరణలో - ముఖ్యంగా రాజారాం లాంటి రైతుపాత్ర తీసుకున్నప్పుడు - ఆస్తికోల్పోవడం కూడ భాగమవుతుంది పరాయీకరణకు శ్రమ ఉత్పత్తిని కోల్పోవడం, జీవితాచరణను కోల్పోవడం అనే అర్థాలకన్న ఎక్కువగా మనిషి తన మానవ సహజాతాలనుంచి దూరం కావడం, తన నుంచి తానే పరాయి కావడం అనే అర్థాలు వర్తిస్తాయి. పరాయీకరణ గురించి మార్క్సిస్టు ఆలోచనాధారలో జరిగిన చర్చకు ఈ అర్థ భూస్వామ్య - అర్థవలస నేపథ్యంలో పరాయీకరణను కూడ కలపవలసి ఉంటుంది.

పరాయీకరణకు ప్రతిస్పందనల్లో కూడ పరాయీకరణకు లొంగిపోవడం, పరాయీకరణను ఎదిరించడం, పరాయీకరణకు లొంగిపోయి నిర్వ్యాపకంగా ఉండడం ఉంటాయి. అయితే ఎప్పుడు ఏ ప్రతిస్పందన ఉంటుందనేది ఆయా నిర్దిష్ట సామాజిక చారిత్రక స్థితినిబట్టి ఉంటుంది. రాజారాం మొదట ప్రదర్శించిన నిర్వ్యాపక ప్రతిస్పందనను అర్థం చేసుకోవచ్చు. కాని కథ ముగింపులో ఏ ప్రతిస్పందనను స్వీకరించాలో తెలియని కూడలిలో రాజారాం మిగులుతాడు. 1980ల కరీంనగర్‌లో ఒక పరాయీకృత మనిషి ఇటువంటి ప్రతిస్పందనను చూపే అవకాశం ఉందా ? ఒకవేళ ఉన్నా ఆ ప్రతిస్పందనను కళారూపంలో చిత్రించడంవల్ల ఏ ప్రయోజనం సిద్ధిస్తుంది ? అప్పటికే మనిషి లోపల విధ్వంసాన్ని అర్థం చేసుకుని, నిర్మాణానికి పూనుకున్న ఉద్యమం వికసిస్తున్నప్పుడు 'మనిషి లోపలి విధ్వంసం' ఆ ఆశావహమైన ముగింపుతో ఉండవలసింది.

'మనిషి లోపలి విధ్వంసం'లో పాత్రలు పెరగడంవల్ల, ఆయా పాత్రల పరిణామంలో లోపాలవల్ల కథ ఎగుడు దిగుడుగా తయారయింది గాని శైలీ శిల్పాల దృష్ట్యా శక్తివంతంగా, ఒకే ప్రధాన పాత్ర ఉండడం వల్ల సూటిగా చెప్పదలచిన విషయాన్ని వివరించిన కథ 'మధ్యవర్తులు'.

'మధ్యవర్తులు' కథలో రచయిత ప్రధాన పాత్రతో పరాయీకరణ చెందుతున్నట్టు వాచ్యంగా చెప్పించాడు. ఆ పరాయీకరణ చదువు ద్వారా సాగుతున్నట్టూ చెప్పించాడు. ఆ ప్రధానపాత్ర నాగేంద్రం. ముప్పై ఆరు సంవత్సరాల వయసుకే "చేతినిండా డబ్బు.... టౌన్‌లోనే ఏ డాక్టరుకు లేని ప్రాక్టీసు" సంపాదించాడు. కాని "రానురానూ తను ఒంటరివాడై పోతున్నాడనిపిస్తుంది. "మనసులో ఖాళీ పెరుగుతోంది." "స్వయంకృషి పేర జరిగిన విధ్వంసమా ఇది ?" అని తనను తాను ప్రశ్నించుకుంటాడు నాగేంద్రం.

నాగేంద్రం రైతుకుటుంబం నుంచే వచ్చాడు. కసితో చదువుకున్నాడు. మురికి గుడ్డలమీద, తనకన్న మంచి గుడ్డలు కట్టిన వాళ్ళమీద, తండ్రి ఉన్నవాళ్ళమీద, దొరల మీద, దొరల పిల్లల మీద కసితో చదివాడు. పరీక్షలు పాసయ్యాడు. స్కాలర్‌షిప్పులు తెచ్చుకున్నాడు. ఇంటర్ ఫస్ట్ క్లాసులో పాసయిన తర్వాత, అప్పటికే తమ్ముడు చదువు మానేసి వ్యవసాయంలో దిగినా, నాగేంద్రం మెడిసిన్ చదవాలనుకున్నాడు. ఫారెస్టర్‌గా పనిచేస్తున్న అన్న సాయంతో ఆ కోరికా నెరవేరింది. "ఔరా, నాగేంద్ర, డాక్టర్ సదువుతున్నవట" అని ఊళ్ళో దొర చేసిన అపహాస్యాన్ని భరించాడు. తనను ప్రేమించిన, తాను ప్రేమించిన గంగను ఆ చదువు కోసమే వదులు

కున్నాడు. ఇంత ప్రియంగా, ఇంత ఇష్టంగా, ఇంత పట్టుదలతో చదివిన చదువు ముగిసేసరికి "మట్టివాసనల నుంచి, తల్లి వేరుబంధాల నుంచి" వేరయిపోయాడు. ఈ చదువు ఉచ్చులోపడి పరాయీకరణ చెందుతున్నట్టనిపించినా ఆ ఉచ్చు అంత బలీయమైంది కాదనుకున్నాడు. "డాక్టరై సేవలు చేద్దామనుకున్నాడు."

ఇప్పుడు "తల్లిని తన దగ్గరికి ఎప్పుడూ తీసుకు రాలేదు. తనుండేది పోష్ లొకాలిటీ. తిరిగేది పై అంతస్తువాళ్ళతో. తన బీదతల్లిని చూసి తనను అంచనా కడతారేమోనని సందేహం". ఇప్పుడు నాగేంద్రం చుట్టూ డాక్టర్లు, ఇంజనీర్లు, జడ్జీలు, లాయర్లు, పోలీసాఫీసర్లు వగైరా చాలమంది ఉన్నారుగాని కన్నతల్లి, అన్నయ్య, తమ్ముడు, ఊరు, ఊళ్ళోని మనుషులు, చెట్లు, పక్షులు, గాలి, వాన, ఎండ, ఇంకా చాల లేవు.

డబ్బు ఇంట్లోకి చాల వస్తువుల్ని తెచ్చింది. "ఏ వస్తువు ఎందుకు వచ్చిందో? అవసరమా కాదా అన్న విషయం అట్లా ఉంచి, ఆ వస్తువులన్నిటిని ఎట్లా ఉపయోగించాలో నేర్చుకునే ఓపికా, తీరికా లేని బతుకు. వస్తువులు పెరిగిన కొద్దీ తాను వాటి మధ్య చిక్కుకుపోతున్నాడు".

అయితే గడిచివచ్చిన జీవితంవల్ల, చదువుకునే రోజుల్లో మిత్రుల ఆదర్శాల వల్ల నాగేంద్రం ఈ ఊబిలో సందేహరహితంగా కూరుకుపోలేదు. ఇంకా అతణ్ణి సందేహాలు బాధిస్తూనే ఉంటాయి. అతనిలో మానవీయ అంశ ఇంకా వికసిస్తూనే ఉంటుంది. తుఫాను బాధితులకు సేవచేయాలనీ, నిర్భాగ్యురాలికి రక్తం ఇవ్వాలనీ, తల్లికీ, తమ్ముడికీ ఏదయినా చేయాలనీ, అన్న కూతుర్ని మెడిసిన్ చదివించాలనీ - మొత్తంమీద తోటి మనుషులకు, సహాయం అవసరమైన మనుషులకు సహాయం చెయ్యాలని నాగేంద్రంకు అనిపిస్తూనే ఉంటుంది. కాని నాగేంద్రం బతుకుతున్న పరిసరాలు సరిగ్గా ఇందుకు వ్యతిరేకమైన విలువలను ప్రబోధించేవి. ఆ విలువల్లో సహాయం, సానుభూతి, సమానత్వం ఉండవు. ధర్మం, చిన్నచూపు, అవమానం, డాంబికం ఉంటాయి.

ఈ విలువల ఘర్షణ, పల్లె-పట్నం ఘర్షణ, డబ్బు పూర్తిగా ప్రవేశించని చోటికీ, డబ్బే సర్వస్వమైన చోటికీ మధ్య ఘర్షణ నాగేంద్రంను ఎప్పుడూ సలుపుతుంటుంది. అతనిలో అనేక జ్ఞాపకాలు పోటెత్తుతాయి. తాను ఒక సామూహిక జీవన సంరంభంలో బతికిన బతుకు గుర్తొస్తుంది. "ఊరందరికి వరుసలే, ఏ కులంవాళ్ళయినా ఊరి కష్టసుఖాలు అందరివీ. అందరి కష్టసుఖాలు ఊరివి" అని గ్రామాన్ని, గ్రామీణ జీవితాన్ని ఆదర్శీకరిస్తాడు. "అద్భుతమైన, శక్తివంతమైన, మాటల్లో చెప్ప

పీలులేని సామూహిక మానవ సంఘజీవితం నుండి వీళ్ళంతా ఎందుకిట్లా స్వార్థపరులుగా, ఒక్కొక్కరుగా, ఒక్కరు మళ్ళీ అనేక చిన్న చిన్న ముక్కలుగా విడిపోయారు? ఇంత పకడ్బందీగా వీరికి శిక్షణ ఇచ్చిన శక్తేది ?" అని ప్రశ్నించుకుంటాడు.

ఈ ప్రశ్నకు జవాబుకోసం మానవజాతి ఎన్నో తరాలుగా అన్వేషిస్తూనే ఉంది. సంఘజీవి అయిన మనిషి, సంఘజీవి కావలసిన మనిషి, సంఘ జీవితానికి వెలుపల మనుగడ అసాధ్యమయ్యే మనిషి ఎందుకు స్వార్థపరుడవుతున్నాడు ? సంఘంలోనే వ్యక్తిగా రూపొందగల మనిషి ఎందువల్ల వ్యక్తిగా, సంఘానికి పరాయి అవుతున్నాడు ? శత్రువవుతున్నాడు ? ఈ వక్రీకరణకు మూలం శ్రమ పరాయీకరణలో, స్వంత ఆస్తి పుట్టుకలో ఉన్నదనే శాస్త్రీయ సత్యం గుర్తించనప్పుడు పైపైన చాల జవాబులు కనబడతాయి. ఆ జవాబుల్లో పాక్షిక సత్యాలూ ఉంటాయి. లోతుగా పరిశీలించకపోతే పూర్తి సత్యాలుగా అనిపించేవీ ఉంటాయి. అటువంటి ఒక పాక్షిక సత్యాన్నే పల్లెటూరి పిల్ల గంగ, వృద్ధరైతు లాలయ్య, పెద్ద చదువులు చదివిన నాగేంద్రం ప్రకటిస్తారు :

"నీకు మనుషులద్దు. నీకు సదువు గావాలె. పెద్ద పదవి గావాలె. పైసలు గావాలె" అంటుంది గంగ.

"గీ దునియల సదువుకున్నోళ్ళంత లంగలు లేరు" అంటాడు లాలయ్య.

"నాకు అర్థమైనంతవరకు నేను అనుభవించినంతవరకు చదువంటే సృష్టికర్తలైన మనుషులనుండి కొంతమందిని వేరుచేసి శిక్షణ ఇవ్వడం. అప్పుడు రైతు బిడ్డడు, కార్మికుని కొడుకు, తల్లిపేగు సంబంధం తెంపుకొని ప్రభుత్వంగ మారతాడు. తన తండ్రిమీదికే, తన బంధువుల మీదికే అధికారిగా వస్తాడు. మాయజేస్తాడు. చదువు చెప్పే పంతులుగా, మందులిచ్చే డాక్టర్‌గా, తగువులు పెంచే వకీలుగా, జడ్జిగా, పోలీసాఫీసరుగా, మంత్రిగా, ఎం. ఎల్. ఎ. గా ఎన్నయినా అవుతాడు. మనలాంటి దేశాల్లోనైతే సకల అధికారాలకు, దోపిడీకి ఈ చదువుకున్నవాళ్ళే మధ్యవర్తులు. గవర్నమెంటు భాషలో చెప్పాలంటే, వీళ్ళే యంత్రాంగం" అంటాడు నాగేంద్రం.

చదువుకున్న వాడిలో, శ్రమజీవికాని వాడిలో పరాయీకరణకు మూలం చదువు కొనిఉండడమేనా?ఇటువంటివ్యక్తులలో పరాయీకరణకు చదువు ఒక ముఖం మాత్రమే కాని అదే ఏకైక కారణం కాదు. శ్రామికుడి పరాయీకరణకు మూలాన్ని ఎట్లాగైతే సూటిగా శ్రమ ఉత్పత్తి పరాయీకరణలో, జీవితాచరణ పరాయీకరణలో కనిపెట్టగలమో శ్రమజీవి కానివాడిలో అటువంటి ప్రత్యక్ష సంబంధాన్ని చూపెట్టడం కష్టం.

అనేకానేక కోణాలు కలగలిసిన సామాజిక సంక్లిష్టత లోంచి ఇటువంటి పరాయీకరణను విశ్లేషించవలసి ఉంటుంది

"శ్రామికుడిలో పరాయీకరణ కార్యాచరణగా, వియోగ కార్యాచరణగా, ఒక క్రమంగా కనిపించినది, శ్రామికుడు కాని వ్యక్తిలో పరాయీకరణ స్థితిగా, వియోగ స్థితిగా, ఒక స్థితిగా కనబడుతుంది. శ్రామికుడు ఉత్పత్తి క్రమంపట్ల, ఉత్పత్తి పట్ల తీసుకునే నిజమైన, ఆచరణాత్మకమైన పైఖరి శ్రామికుడు కాని వ్యక్తిలో సైద్ధాంతిక పైఖరిగా కనబడుతుంది. శ్రామికుడు తనకు వ్యతిరేకంగా ఏ యే పనులైతే చేసుకుంటాడో, అవే పనులను శ్రామికుడు కాని వ్యక్తి కూడ శ్రామికుడికి వ్యతిరేకంగా చేస్తాడు. అవే పనులను తనకు వ్యతిరేకంగా మాత్రం చేసుకోడు" అని చెప్పి మార్క్స్ వీటిని ఇంకా వివరంగా పరిశీలించవలసి ఉంటుందని అన్నాడు. 1844 ఇకనామిక్ అండ్ ఫిలసాఫిక్ మాన్యుస్క్రిప్ట్స్‌లో మొదటి మాన్యుస్క్రిప్ట్‌లో ఆయన వివరణ సరిగ్గా ఇక్కడే ఆగిపోతుంది. నిజానికి ఈ వివరణను ఇంకా సమగ్రంగా, నిశితంగా విస్తరించవలసిఉంది.

మనిషిని పరాయీకరించే క్రమంలో మతానికి, డబ్బుకు, సంపదకు ఉండే పాత్రను మార్క్స్ కన్న ముందే తత్వవేత్తలు వివరించి ఉన్నారు. దాన్ని అంగీకరిస్తూనే, ఇంకా నిశితంగా వివరిస్తూనే మార్క్స్ పరాయీకరణకూ శ్రమ క్రమానికీ ఉన్న సంబంధాన్ని కనిపెట్టాడు. డబ్బులా, సంపదలా చదువు కూడ సమాజంలో 'పైకి' పోవడానికి, వ్యక్తిని సమాజానికి వ్యతిరేకంగా నిలపడానికి ఒక సాధనంగా ఉపయోగపడుతున్న చోట చదువును పరాయీకరణ సాధనంగా చూడవచ్చును. కాని నాగేంద్రంకు వచ్చిన ప్రశ్నలకైనా, మరెవరికి వచ్చే ప్రశ్నలకైనా ఇదే పూర్తి జవాబు కాదు. అంతేగాక ఈ జవాబు దగ్గరే ఆగిపోతే పరాయీకరణను ఎదిరించాలంటే చదువుకోగూడదనే నిర్ధారణకు రావలసి వస్తుంది. అందుకే నాగేంద్రం రమణకు చదువు చెప్పించవనీ అన్నాడు. ఇది యంత్ర విధ్వంసంలాంటి చదువు వ్యతిరేకత.

పరాయీకరణకూ చదువుకూ మధ్య అభేదాన్ని పాటించడం వల్ల నాగేంద్రం ఈ ముగింపుకు రావలసి వచ్చింది. అట్లాగే పల్లెకూ పట్నానికీ మధ్య వైరుధ్యం విషయంలో కూడ నాగేంద్రానికి ఆదర్శవాద భావాలున్నాయి. ఆ మాట తమ్ముడు కూడ స్పష్టంగానే చెపుతాడు. ఇక్కడ నాగేంద్రం ఆదర్శవాదానికి పునాది శరద్‌జోషి వగైరాల 'ఇండియా వర్సస్ భారత్' వాదనలో కూడ ఉండవచ్చు. ఓరియంటలిస్టుల దగ్గరినుంచి ఆధునిక గాంధీవాదులదాకా ఈ భారతీయ గ్రామాన్ని ఆదర్శీకరించే ధోరణి ప్రబలంగానే ఉంటూ వస్తున్నది. ఈ వాదన ఆకర్షణీయమైంది కూడ.

గ్రామం ఏకశిలా సదృశ్యం కాదనీ, గ్రామంలోనూ, పట్నంలోనూ కూడ దోపిడీ పీడనలు సమానంగానే ఉన్నాయని, కాకపోతే పట్నంలో లేని సన్నిహిత (మానవీయ) సంబంధాలు గ్రామంలో ఉండే అవకాశం ఉందని గుర్తించాలి.

నాగేంద్రం మనస్తత్వంలో చాల విషయాల్లో ఇటువంటి గందరగోళం ఉన్నది. ఈ గందరగోళాన్ని చదువు పెంచి ఉండవచ్చుగాని గందరగోళం దానికి కారణం చదువు కాకపోవచ్చు. ఇంట్లో ఎన్నో కష్టాలున్నప్పుడు తానవన్నీ వదిలేసి చదువుకున్నాననే నేర భావన, తన వాళ్ళకు ఏమీ చెయ్యలేకపోతున్నాననే దిగులు, చదువుకున్ననాటి ఆదర్శాల నుంచి ఎడబాటు, గ్రామ జీవితం నుంచి, శ్రమ నుంచి దూరమైన మనుగడ, విపరీతంగా సంపాదించిన డబ్బు మొదలయిన ఎన్నో కారణాలు నాగేంద్రంను తన నుంచి తననే పరాయిని చేశాయి. కథ ఈ అన్ని కారణాలనూ ఏదో ఒక స్థాయిలో చిత్రించింది కూడ. కాని చివరికి వచ్చేసరికి చదువొక్కటే ఈ పరాయీకరణకు కారణమనే దగ్గర ఈ కథ ముగిసింది.

ఈ ముగింపు ఇంకా సమగ్రంగా ఉండవలసిందనే విమర్శను పక్కన పెడితే, 'మధ్యవర్తులు' కథ ఒక మధ్యతరగతి బుద్ధి జీవి మనసులో చెలరేగే, చెలరేగవలసిన అలలన్నిటినీ శక్తివంతంగా పట్టుకుంది. ఈ సంక్షోభానికి, ఈ కల్లోలానికి కారణం పరాయీకరణ అని, ఆ పరాయీకరణకు మూలం శ్రమ పరాయీకరణలో, స్వంత ఆస్తిలో, డబ్బులో, అమానవీకరించే భావజాలాలలో ఉన్నదనే గుర్తింపును, పరాయీకరణను ఎదిరించే క్రమంలోనే మనిషి మానవుడిగా ఎదగగలడనే గుర్తింపును ఇవ్వగలిగితే ఈ కథ విజయం సాధించినట్టే.

మొత్తంమీద ఈ రెండు కథలనూ పరాయీకరణ భావన నేపథ్యంగా పెట్టుకుని చదివితే, ముఖ్యంగా మార్క్స్ రాసిన 1844 ఇకనామిక్ అండ్ ఫిలసాఫిక్ మాన్యుస్క్రిప్ట్స్ నేపథ్యంగా పెట్టుకుని చదివితే సామాజిక సంక్షోభం గురించి, పరిష్కారాల గురించీ విలువైన ఆలోచనలు కలుగుతాయి.

"స్వంత ఆస్తి అనేది మానవుని స్వీయ పరాయీకరణ. కమ్యూనిజం దాన్ని నిజంగా అధిగమిస్తుంది. అందువల్ల కమ్యూనిజమంటే మానవ సారాన్ని మనిషి కోసం మనిషి ద్వారా నిజంగా స్వాధీనం చేసుకోవడమే. అంటే కమ్యూనిజం అనేది మనిషి సంఘజీవిగా, మానవ జీవిగా తనను తాను సంపూర్ణంగా చేరుకోవడం అవుతుంది. ఈ పునస్సమాగమం చైతన్యయుతంగా జరుగుతుంది. అంతకు ముందరి సకల అభివృద్ధి సంపదనూ తనలో సంలీనం చేసుకుంటుంది" అన్నాడు మార్క్స్. ఇట్లా మనిషి మానవుడిగా, సంఘజీవిగా తనకు తాను చేరుకోవడం సాయపడడమే కళా సాహిత్యాల సార్థకత. ○

(4వ పేజీ తరువాయి)

మంతా ఎ.పి.సి.ఎల్.సి నిజ నిర్ధారణ కమిటీ నర్సంపేట తాలూకాలో తిరుగుతూనే వున్నది.

అది గ్రామ పంచాయితీగానీ, అది కోర్టుగానీ, అది బార్ అసోసియేషన్‌గానీ, అది నిజ నిర్ధారణకానీ, అంతటా ప్రజల తరఫున ప్రశ్నించే ప్రజాతంత్ర ఉద్యమానికి ప్రభాకర్ రెడ్డి ప్రాణం పోశాడు.

నర్మెట పోలీస్‌స్టేషన్‌లో అరెస్టయిన ఆర్.వై.ఎల్ కార్యకర్త ఆ తర్వాత ఉద్యమంలో ఉన్నాడా? సరెండరయ్యాడా? అన్నదానికన్నా అక్రమ అరెస్టుకు వ్యతిరేకంగా వేలాదిమంది పోలీస్‌స్టేషన్లముందు గ్రామాలలో ఎట్లా తరలివచ్చి నిరసన తెల్పుతున్నారో చూడగలిగితే, ఇవాళ ప్రభాకర్ రెడ్డిని పోలీసులు ఎందుకు పిరికి కుట్రతో హత్య చేశారో అర్థమవుతుంది. వందలాది మంది ప్రజలపై టాడా కేసులు పెడితే బెయిల్‌పై విడిపించిన అతన్ని హత్యచేసి శవం దగ్గరకు ఎవర్నీ పోనివ్వకుండా పోలీసులు దిగ్బంధం చేస్తే ఆయన గ్రామంలో ఆయన అంత్యక్రియలకు అశేష ప్రజానీకం తరలి వచ్చారంటే శత్రువు పగుళ్ళు మూసేస్తుంటే గండిపడే స్థితి వుందనీ, ఆకాశానికి అరచెయ్యి అడ్డుపెడితే అంతటా సూర్యకాంతి విరిసే పరిస్థితి వుందనీ ఊహించడం కష్టం కాదు. డాక్టర్ రామనాథంగారిని హత్యచేసిన ఐదేళ్ళకు ఒక ప్రభాకర్ రెడ్డి వరంగల్‌లో గొంతు సవరించుకున్నాడు. కాని ఇవాళ ఒకవైపు సాక్ష్యాధారాలు మిగలకుండా ఆయన హత్యామరకలు శత్రువు కడుగుతుండగానే పది వేలమంది ప్రజలు 'ప్రభాకర్ రెడ్డి అమర్ హై', 'పౌరహక్కుల సంఘం వర్ధిల్లాలి' అంటూ పల్లెలనుండి వెల్లండకు కదలివచ్చారు.

ఆ కదలికకు మూల్యంగా బొమ్మకూర్ 'ఎన్‌కౌంటర్'లో వాళ్ళు మరో నాలుగు ప్రాణాలు చెల్లించాల్సి రావచ్చు. ఆ కదలిక ఫలితంగా జనగామ, హనుమకొండ పట్టణాల్లో చివరకు నర్మెట, చేర్యాల మండలాల్లోకూడ బి.ఎస్.ఎఫ్ ఫ్లాగ్ మార్చ్‌లు జరగవచ్చు. కానీ దేశ సరిహద్దు భద్రతకు ఉద్దేశించిన సైన్యాలు తెలంగాణా పల్లెల్లోకి తరలి వచ్చాయంటే ఇవాళ ఇది దేశాల మధ్యనగాదు, రెండు వర్గాల మధ్యన యుద్ధమని తేలిపోయింది. బుద్ధిజీవులు ఫ్లాగ్‌మార్చ్‌ను చూసి భయపడ్తారా? ప్రజల మార్చింగ్ ఫ్లాగ్‌వెంట ఉంటారా అన్నదే ఇవాళ వేసుకోవల్సిన ప్రశ్న. ప్రభాకరరెడ్డి ఆశయాన్ని కొనసాగిస్తామన్న ప్రతిజ్ఞలో ఆ సవాల్‌కు సమాధానమూ వుంది.

15-12-91

— సంపాదకుడు

SRJANA Telugu Monthly December 1991
Regd. No. with the Registrar of Newspapers for India 10953/67

# సృజన రేటు, సంవత్సర చందా పెంచక తప్పడంలేదు

సృజనకు ఆర్థికంగా, హార్దికంగా సహకరించవలసినదని చేస్తున్న విజ్ఞప్తికి ముఖ్యంగా మనసు విప్పి చెప్పుకున్న ఇబ్బందులకు కొందరు పాఠకులనుంచయినా మంచి ప్రతిస్పందన వచ్చింది.

అయితే కేంద్ర ప్రభుత్వ బడ్జెట్ రూపంలో వచ్చిన ఐ.ఎం.ఎఫ్. దాడికి పత్రికలుకూడా తాళలేనంత దెబ్బతిన్నవి. న్యూస్‌ప్రింటు ధర నలభై శాతం పెరిగిపోయింది. న్యూస్‌ప్రింటు కోటాకూడా లేని సృజన వంటి పత్రికలకు ఈ రేటు రెట్టింపు పెరిగినట్లు లెక్క.

పత్రికయ్యే ఖర్చు సాధారణంగా కాగితానికి సగం, ప్రింటింగుకు సగం అవుతుంది. (లెటరు పైపు కంపోజింగులో). కనుక పెరిగిన కాగితం ధర నలభై శాతమే లెక్కవేసుకున్నా అరవై పేజీల పత్రికకే మరో రూపాయి రేటు పెంచక తప్పదు. మేం ఇటీవల కాలంలో 70 పేజీలకు తగ్గి ఎప్పుడూ సంచిక ఇవ్వలేదు.

ఇప్పుడే మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్లు బడ్జెట్ న్యూస్‌ప్రింటు ధర పెంచింది.

ఇకనుంచి తప్పనిసరిగా 64 పేజీల

విడి ప్రతి 5 రూపాయలు సంవత్సర చందా 50 రూపాయలు

చేయక తప్పడంలేదు.

అన్నీ గ్రహించగల సృజన పాఠకులు సహకరించగలరని ఆశిస్తాం.

'సాహితీమిత్రులు'

SRJANA Rs. 5/-
Flat 11, Block 2,
MIG II, Baghlingampalli,
Hyderabad - 500 044.